# కొత్తపల్లి పిల్లల కథల పుస్తకం-69

జూలై 2014

**మూలం: http://kottapalli.in/2014/07/welcome**


**ఏపని- ఎవరిది:**

ప్రచురణ: కొత్తపల్లి ప్రచురణలు, చెన్నేకొత్తపల్లి

నిర్వహణ: సత్యఫౌండేషన్, చెన్నూరు.

ప్రధాన సంపాదకులు: నారాయణ

సహసంపాదకత్వం: మంజునాథ్

చిత్రాలు: వీరాంజనేయులు, అడవి రాముడు

సాంకేతిక సహకారం: ఆనంద్, లక్ష్మి

వాణిజ్యం: మల్లికార్జున

గౌరవ సలహాదారు: సుబ్బరాజు

అక్షర కూర్పు: కొత్తపల్లి

అలంకరణ: యాక్ తూ ఫైన్ ఆర్ట్స్ స్టుడియో, హైదరాబాదు. ఫోను: 04042206233

ముద్రణ: ముద్రికా ఆఫ్‌సెట్ ప్రింటర్స్, విజయవాడ ఫోను: 08662579129


స్వాగతం!

కొత్తపల్లిలో పిల్లల రచనలకు ప్రాధాన్యత ఉంటుంది. ఈ పుస్తకంలో దాదాపు సగం కథలు పిల్లలు రాసినవి; మిగిలినవి పిల్లలకోసం పెద్దలు రాసినవి. బొమ్మలు వేసిన వాళ్ళు మటుకు యువకులు.

పిల్లలను కలవటం, వాళ్లతో తెలుగులో కథలు రాయించటం, బొమ్మలు వేయించటం, వాళ్ళు పంపిన కథల్ని, బొమ్మల్ని సరిదిద్ది మిగతా పిల్లలందరికీ నచ్చేట్లు పుస్తకాలుగా తయారు చేయటం, దానికోసం ఓపెన్ సోర్సు ఉపకరణాలను వాడటం, కథల్ని అందరూ ఉచితంగా చదువుకునేట్లు ఇంటర్నెట్‌లో పెట్టటంతోపాటు, కొన్ని ప్రతులు అచ్చువేయటం మాకు ఇష్టం. అందరి మేలూ కోరి చేసే ఈ పనిలో మీరూ పాలుపంచుకోండి. పిల్లల కథల ప్రపంచానికి స్వాగతం!



**వెలల పట్టిక:**

| | **వ్యక్తులు** | **సంస్థలు** |
|---|---|---|
| **విడి ప్రతి వెల** (పోస్టేజీ అదనం) | **25** రూ. | 30 రూ. |
| **12 ప్రతులు** (పోస్టేజితో సహా) | **300** రూ. | 350 రూ. |

రానున్న 12 ప్రతులకోసం డబ్బుల్ని మనిఆర్డరు/బ్యాంకు ట్రాన్సుఫరు ద్వారా చెల్లించండి. మీ చిరునామాను వేరుగా ఫోను/మెయిలుద్వారా తప్పక తెలియజేయండి. పుస్తకాలను సాధారణ పోస్టులో పంపుతాం,

మీ రచనలను పోస్టు/ఇమెయిలు రూపంలో పంపండి. బాగున్నవాటిని తప్పక ప్రచురిస్తాం!

బ్యాంకు ట్రాన్సుఫరు కోసం అక్కౌంటు వివరాలు:

Kottapalli Prachuranalu,
S.B. A/c No: 62320333310
SBH- Dharmavaram Branch,
ISFC code: SBHY0020902


కొత్తపల్లి ప్రచురణలు

1-127/A, యం ఆర్ వో ఆఫీసు దగ్గర,
చెన్నేకొత్తపల్లి- 515101
అనంతపురం జిల్లా

ఫోను: 7702877670 ఇ-మెయిలు: team@kottapalli.in

వెబ్‌సైటు: http://kottapalli.in




# విషయ సూచిక

**ముందుమాట**



**ధారావాహిక**



**పిల్లలు రాసిన కథలు**



**పెద్దలు రాసిన కథలు**



**అవీ-ఇవీ**

# అన్నం తినే వాళ్ళు!

పట్నం నుండి వచ్చాడు మామయ్య.

మామయ్య, చిట్టి ఇద్దరూ కొత్తపల్లిలో సాయంత్రం పూట నడచుకొని పోతున్నారు.

వాళ్ళవెనకనుండి వచ్చిన ఓ ట్రాక్టరు వాళ్లని దాటుకొని బరువుగా ముందుకు పోయింది.

ఆ ట్రాక్టరు వెనక ఓ ట్రాలీ ఉంది. దాని నిండుగా వడ్ల బస్తాలు- ఎత్తుగా అమర్చి ఉన్నాయి. వాటిమీద నలుగురైదుగురు కుర్రవాళ్ళు కూర్చొని ఉన్నారు. ఆ వడ్ల యజమాని రైతు కొంచెం పెద్దాయన- ట్రాక్టరులో డ్రైవరుతోబాటు కూర్చొని ఉన్నాడు.

"వడ్లనుండి బియ్యం వస్తుంది పాపా" చెప్పాడు మామయ్య, చిట్టికి. "ఇక్కడేమైనా రైస్‌మిల్ ఉందా?"

చిట్టి దూరంగా ఉన్న రైస్‌మిల్లును చూపించింది.

"ఊఁ..ఇది వెళ్ళేది అక్కడికే. మిల్లులో యంత్రాలుంటై. అవి వడ్లమీద ఉండే పొట్టును తీసేసి, పాలిష్ పట్టి, తెల్లటి బియ్యాన్ని బయటికి తీసుకొస్తాయి. ఆ బియ్యాన్ని ఉడికించితే మనం తినే మల్లెపువ్వులాంటి అన్నం తయారవుతుంది" వివరించాడు మామయ్య.

ట్రాక్టరు వీళ్ల ముందుగా ఎడమవైపుకి తిరిగింది. ట్రాలీలో బస్తాలమీద కూర్చున్న వాళ్ళు ఒక్క పెట్టున అరిచారు- "ఓయ్! మెల్లగా! మెల్లగా తిరుగొరే, డ్రైవరూ!" అని. అదే సమయానికి ట్రాక్టరులో కూర్చున్న రైతూ అరిచాడు ఇంకా గట్టిగా- "ఓయ్! జాగ్రత్తగా పట్టుకొని కూర్చోండిరా నాయనా! పైనున్న వాళ్ళంతా అసలే అన్నం తినే నా కొడుకులు!" అని. ట్రాక్టర్లో వాళ్లంతా నవ్వారు. ట్రాక్టరు మలుపు తిరిగి రైసుమిల్లువైపుగా పోయింది.

" 'అన్నం తినే నా కొడుకులు' అంటే ఏంటి మామయ్యా?" అడిగింది చిట్టి.

ఏం చెప్పాలో తెలీక మామయ్య నీళ్ళు నమిలాడు- "అది..అదేదో తిట్టు, పాపా" అన్నాడు తడబడుతూ.

వీళ్ళ పక్కనే నడుస్తూ వస్తున్న తాత ఒకడు అది విని గట్టిగా నవ్వి, చెప్పాడు- "ఏం లేదు పాపా! ఇదివరకటి కాలంలో పల్లెల్లో అందరూ రోజూ రాగి ముద్ద తినేవాళ్ళు. జొన్న అంబలి త్రాగేవాళ్ళు. సంకటి తినీ తినీ రాళ్ళలాగా గట్టిపడి, బలంగా ఉండేవి వాళ్ల శరీరాలు. మరి ఇప్పటివాళ్ళు- ఇదిగో మీ మామయ్యలాంటి వాళ్లంతా- మల్లెపువ్వులాంటి తెల్లటి, మెత్తటి అన్నం తినేకి అలవాటు పడ్డారు. అప్పటి వాళ్ళ బలాలు లేవు ఇప్పుడు! ఇదిగో, మీ మామయ్యనే చూడు- ఎట్లా ఉన్నాడో చూశావా, నీరసంగా? ఒక్క బస్తా వడ్లు లేవనెత్తాడంటే ఎముకలు టపటపా విరిగి ఊరుకుంటాయి. అదే అంటున్నాడు, ఆ ట్రాక్టరులో పెద్దయ్య- 'వీళ్లంతా అన్నం తినే నా కొడుకులు'"- అనేసి చక్కా పోయాడు తాత.

"రాగి ముద్ద అంత మంచిదా, మామయ్యా?!" అడిగింది చిట్టి.

"అవునట, చిట్టీ. రాగుల్లో చాలా కాల్షియం ఉందట, ఐరన్ ఉందట. ఇదివరకు ఇక్కడ పల్లెల్లో అంతా రాగులు, జొన్నలు, సజ్జలు, సామలు, ఆరికెలు, ఉలవలు- ఇట్లా రకరకాల చిరుధాన్యాలు బాగా తినేవాళ్ళు. నిజంగానే వాటిలో ఉన్నన్ని పోషక తత్వాలు మనం తినే తెల్ల బియ్యంలో లేవు" నిజాయితీగా చెప్పాడు మామయ్య.

"మరైతే మనం కూడా ఇప్పుడు బియ్యం మానేసి వాటినే తినచ్చుగా?" అంది చిట్టి.

"మరేం మాతల్లీ! నా ప్రాణం తీస్తావా, ఏం?! అవి ఏమంత రుచిగా ఉండవు తల్లో! మెత్త మెత్తగా, గట్టి గట్టిగా, ఉడికీ ఉడకనట్లు- అమ్మో! తలచుకుంటేనే భయం వేస్తుంది" అన్నాడు మామయ్య తేలికగా నవ్వి.

"ఏమైనా సరే, 'మంచివంటే తినాలి' అని నువ్వే చెబుతావు కద, మామయ్యా?! ఇవన్నీ మంచివి

గనక, మనం వీటిని అప్పుడప్పుడూ తింటుందాంలే, కనీసం. బలం వస్తుంది కదా, మనకే!"అంది చిట్టి.

"ఏంటో తల్లీ! ఇవాళ్ల ఈ ట్రాక్టరేదో నా ప్రాణం తినేందుకే వచ్చినట్లుంది" అన్నాడు మామయ్య.

"ఇంట్లో అమ్మకూడా ఒక్కోసారి రాగిముద్ద, జొన్నసంకటి చేస్తుంది మామయ్యా. అయితే అవి చేసినప్పుడల్లా నేనూ నీలాగానే 'కుయ్ కుయ్' అనేదాన్ని. నాకు తెలీదు కదా, వాటిలో బలం గురించి, అందుకని అట్లా చేసేదాన్ని! మరి ఇకమీద నేను వంకలు పెట్టకుండా ఇష్టంగా తింటాను. ఇవాళ్ళ మనిద్దరి కోసం స్పెషల్‌గా రాగిముద్ద చెయ్యమందామా?" అంది చిట్టి, పెద్దదానిలాగా ముఖం పెట్టి.

మామయ్యకి సరే అనక తప్పలేదు.

మనం అందరమూ కూడా చిట్టి బాట పడదాం. చిరుధాన్యాల వాడకం పెంచుదాం- కేవలం బియ్యం తింటే చాలదు: గురజాడ అప్పారావు గారు చెప్పినట్లు, "ఊసురోమని మనుషులుంటే-దేశమేగతి బాగుపడునోయ్? తిండి కలిగితే కండ కలదోయ్-కండ కలవాడేను మనిషోయ్". మనం బలంగా ఉంటేనే కద, దేశం బలంగా ఉండేది?! అందుకని, బాగా తిందాం! రకరకాల పదార్థాలు తిందాం!

మీరు అందరూ బలంగా పెరగాలని కోరుకుంటూ,

కొత్తపల్లి బృందం

మీకు ఈ పుస్తకం నచ్చిందా? మరైతే దీన్ని వృధా పోనివ్వకండి. మీదగ్గరున్న పుస్తకాలను మీ స్నేహితులతో తప్పకుండా పంచుకోండి. 'పుస్తకాలు పంచుకోవటం' బలే బాగుంటుంది! దానివల్ల అందరికీ లాభమే మరి!



# నీతిచంద్రిక

సంధి-3

*జరిగిన కథ: యుద్ధంలో నెమలి గెలిచింది. ఓడిన హంస రాజుకు గూఢచారి కొంగ వచ్చి శత్రురాజ్యపు విశేషాలు చెబుతున్నది. అక్కడ ప్రధానమంత్రి దూరదర్శి నెమలికి 'కుందేలు - పిట్ట- పిల్లి' కథ చెప్పింది. కుందేలు, పిట్ట తమ తగవు తీర్చమని పిల్లి దగ్గరకు వెళ్ళాయి. ఇక చదవండి, నీతిచంద్రిక 50 వ భాగం...*

*మూలం: కీ.శే. కందుకూరి వీరేశలింగం* *సరళీకరణ: ఘుడియారం వేంకట నారాయణ శర్మ*

'పెద్దల దగ్గరికి పోదాం! వెనక్కి తగ్గేది లేదు! ఈ రాత్రి గడవనియ్యి. తెల్లారగానే పోదాం!" అని, మిగిలిన రాత్రిని ఏదో ఒక విధంగా గడిపింది కపింజలం.

తెల్లవారగానే అది కుందేలును నిద్రలేపి, 'పద, పోదాం- మన తగవులను తీర్చే పెద్దల దగ్గరికి! నీకు ఎవరి మాటంటే నమ్మకం?" అని అడిగింది.

"నర్మదా నదీ తీరంలో 'దధికర్ణుడు' అనే పిల్లిరాజు ఒకడున్నాడు. అతను వయసులో పెద్దవాడు, లోకపు తీరు తెన్నులు, వ్యవహార సరళి తెలిసిన వాడు, శాంతమూర్తి,

ధార్మికుడున్నూ. మన తగవును తీర్చగల-వాడు అతనే!" అన్నది కుందేలు.



'అవును కాబోలు' అనుకున్న కపింజలం 'సరే'నన్నది. అలా కుందేలు, పిట్ట పోయి పోయి మధ్యాహ్నానికి దధికర్ణం ఉండే చోటును చేరుకున్నాయి. అయ్యో! పోయేకాలం దాపురించినప్పుడు, తలలు తెగిపడాల్సిన చోటు ఎంతదూరం అయినా సరే, కాళ్లు శరీరాన్ని అక్కడికే ఈడ్చుకుపోతాయి గదా!

అట్లా ఆ దీర్ఘకర్ణం, కపింజలం రెండూ నర్మదానది ఒడ్డుకు నడిచిపోయినై. అక్కడ తపస్సు చేసుకుంటున్నట్లు కూర్చున్న ముసలి పిల్లిని చూసి, 'అది వట్టి కపట ధార్మికుడు' అని, 'కేవలం కడుపు నింపుకునేందుకే దాని వేషం అంతా' అని తెలుసుకోలేక-పోయినాయవి.

అయినా, దూరంగానే నిలబడి- "స్వామీ! ఓ పిల్లిరాజా! మాలో మాకు స్థల వివాదం ఒకటి మొదలైంది- ధర్మ స్వరూపులైన తమరి సన్నిధిలో మా సమస్యకు పరిష్కారం లభిస్తుందని చాలా ఆశతో, ఎంతోదూరం నుండీ వచ్చాం. ఊరికే నిలబడనివ్వక, త్వరత్వరగా మా పోట్లాటను తీర్చి, మమ్మల్ని మా నివాసాలకు పంపు" అన్నాయి.

అప్పుడా ముసలి పిల్లి తెలివిగా "అయ్యలారా! మీరేమో దూరంనుండీ చెబుతున్నారు. ముసలితనపు బరువుకు నేను చేసే చాంద్రాయణ వ్రతంకూడా తోడయ్యేసరికి, నా వినికిడి బాగా తగ్గిపోయింది. మీరేం చెబుతున్నారో నాకు సరిగా వినబడమే లేదు! మీరిద్దరూ చెరొక చెవిదగ్గరా చేరి, మీరు మీరు చెప్పదలచుకున్న అంశాలను పెద్ద గొంతుతో, స్పష్టంగా చెప్పండి.

మధ్యాహ్నం అయ్యింది- నాకుపూజా సమయం దగ్గర పడుతున్నది. పూజలు ముగించుకొని దానధర్మాలు చేసుకోవాల్సి ఉన్నది. అయినా తగవు తీర్చేవాళ్ళు ఎందరెందరో ఉన్నా కానీ, మీరు వాళ్ళను ఎవ్వరినీ కాదని, నేనేదో పక్షపాతం లేకుండా తీర్పు చెబుతానని, అంతదూరం నుండి వచ్చారు! అట్లాంటి మిమ్మల్ని ఊరికే వెనక్కి పంపించటం, మాలాంటి తపస్వులకు తగదు. ఈ లోకంలోనే ఎల్లకాలం ఉట్టి కట్టుకుని ఎవ్వరమూ ఊగులాడం. చచ్చిపోయిన-ప్పుడు ధర్మం ఒక్కటి తప్ప, మరేవీ మన వెంట రావు. కాబట్టి అట్లాంటి ధర్మాన్ని మాత్రం, ఎన్ని కష్టాలు ఎదురైనా సరే, పోగొట్టుకోకూడదు. ఇదే సత్యం. మనం సత్యాన్ని ఎప్పుడూ తప్పకూడదు. అన్ని శుభాలకూ మూలం సత్యమే.

సత్యానికి తోడుగా మనకు భూతదయ కూడా ఉండాలి. అన్ని ధర్మాలకూ అలంకారం భూతదయే. 'తన శరీరంలో ఎక్కడైనా ముల్లు దిగితే తనకు ఎంత నొప్పి పుడుతుంది! ఇతరుల శరీరాలూ అట్లాంటివే కదా?'అని తెలుసుకొని, వివేకవంతులు ఎల్లప్పుడూ హింసకు దూరంగా ఉంటుంటారు.

కానీ దుర్మార్గులకు ఇంత లోతుగా అర్థం ఎక్కడవుతుంది?! అందుకని వాళ్ళు దయా-ధర్మాలను విడచి, కేవలం బ్రతకటంకోసం ఇతర జీవుల హింసకు పాల్పడుతుంటారు.

"తనను ఆశ్రయించిన-వాళ్ళను కాపాడటాన్ని మించిన ధర్మం లేదు' అని మన గ్రంథాలన్నీ ఘోషిస్తున్నాయి కదా.

అంతేకాదు- లోభం అనేది ఉన్నదే, దాన్ని ముందుగానే మొదలంటా మట్టుపెట్టేయాలి. మీరే చెప్పండి, ఎంత సంపాదించినా గానీ, మనం పోయేటప్పుడు లోకంలోంచి దేన్నైనా మూట గట్టుకొని పోతామా? పోము కదా! అయినా చూడు, 'ఓ దురాశా! పాపభూయిష్టం అయిన ఈ కలికాలంలో నువ్వెంతమందిని వశపరచుకున్నావే! ఎంతమందితో ఎన్నెన్ని చెడ్డపనులు చేయిస్తున్నావే! అబ్బా! నీ మాట ఎత్తితేనే నా గుండెలు పగులుతున్నాయే!' " అంటూ

చల్లని మాటలతో ధర్మోపన్యాసం చేయటం మొదలుపెట్టింది.

అది విని పిట్ట, కుందేలు రెండూ చాలా ముచ్చట పడ్డాయి. తమ పోరును దానికి మరింత చక్కగా వినిపించేందుకు అవి రెండూ పిల్లి దగ్గరికి పోయినై. దాని చెవుల్లో తమ తగవును వినిపించేందుకు వంగినై- మరుక్షణం ఆ దొంగ పిల్లి కాళ్ళతో ఆ రెండింటినీ చిక్కబట్టింది; ఒక్కసారిగా వాటి మెడలు కొరికింది; వాటిని చిత్రవధ చేసేసింది. పిట్టపోరు-కుందేలు పోరు అలా పిల్లి తీర్చింది.

చివరిక్షణంలో ఆ కుందేలు, పిట్ట రెండూ "అయ్యో! ఒక్క రాత్రికి ఎవరు పడుకుంటే ఏమిలే' అని ఊరుకోక, లేనిపోని తగవు పడటం ఏమిటి, సుఖంగా అడవిలో పడి ఉండలేక ప్రొద్దునే లేచి ఇక్కడికి పడి రావటమేమిటి, వచ్చి ఈ దుర్మార్గుడిని ఆశ్రయించటం ఏమిటి, వీడి దొంగ మాటలు విని ఇంతవరకూ తెచ్చుకోవటం ఏమిటి?!

'పోరు నష్టం- పొందు లాభం' అని పెద్దలు చెప్పే మాటలు వినలేదే! చావు మూడినప్పుడు, ఎవ్వరిమాటలూ పనికిరావు. 'తానొకటి తలిస్తే దైవం ఒకటి తలిచింద'ట! రాసి పెట్టింది జరగక మానదు!" అని విచారపడుతూ ప్రాణాలు విడిచాయి.



పిల్లికి అట్లా వాటి మాంసంతో రెండు రోజులు వేరే దేన్నీ వెతుక్కోకుండా నడిచింది. కాబట్టి, తక్కువవాడిని ఊరికే అందలం ఎక్కించకూడదు" అని చెప్పింది ప్రధానమంత్రి దూరదర్శి.

అప్పుడా నెమలి రాజు చిత్రవర్ణుడు దూరదర్శిని చూసి "అవును నిజమే. మీరన్నట్లు మేఘ-వర్ణుడికి వేరే ఉపకారం ఏదైనా చేద్దాం. కానీ

ముందుగా ఒక పని చేద్దాం. మనం గెల్చుకున్న ఆ కర్పూర ద్వీపానికి ఈ మేఘ వర్ణుడిని మళ్ళీ ఓసారి పంపుదాం. ఇతను వెళ్ళి ఆ రాజ్యంలో ఉన్న మంచి మంచి వస్తువులను అన్నింటినీ ఇక్కడికి తెచ్చి పెడతాడు. అట్లా తెచ్చిన అద్భుత వస్తువులలో కొన్నింటిని మన బంధువులకు, మిత్రులకు బహుమానంగా పంపుదాం. కొన్నిటిని మన తోటివారికి పంచుదాం. మిగిలినవాటిని మనం ఇష్టం వచ్చినట్లు అనుభవిద్దాం. ఆ తర్వాత మనమే ఎల్లకాలం ఇక ఎదురులేకుండా ఆ ద్వీపాన్నికూడా పరిపాలించచ్చు..!" అని సంతోషంగా ఇంకేదో చెప్పబోయింది.

అప్పుడా ప్రధాని నవ్వి, వినయంగానే "ప్రభూ! ఇంకా జరగని పనులను దలచుకొని సంతోష పడద్దని ధర్మం తెలిసినవాళ్ళు చెబుతుంటారు. ఆలోచనల పల్లకీనెక్కి ఊహల ఊరేగింపులో మైమరచేవాడు చివరికి పేలపిండి కుండను కూడా పగలగొట్టుకున్న బ్రాహ్మణుడి మాదిరి, బాధ పడతారు. మీకు ఆ కథ చెబుతాను వినండి-

## దేవశర్మ అనే బ్రాహ్మణుడి కథ

అయోధ్యా నగరంలో దేవశర్మ అనే బ్రాహ్మణుడొకడు ఉండేవాడు.



సూర్యుడు నెలకొక రాశిలో సంక్రమణం చెందుతుంటాడు కదా; అట్లా సూర్యుడు (మార్చినెలలో) సంక్రమణం చెందుతున్న సమయంలో శ్రాద్ధం పెట్టటం ఆ రోజుల్లో ఆనవాయితీగా ఉండేది. దేవశర్మకూ అలా ఓ శ్రాద్ధకర్మ చేయించేందుకు రమ్మని పిలుపు వచ్చింది.

ఆ పని చేయించినందుకుగాను వాళ్ళు అతనికి

కడుపునిండా భోజనం పెట్టి, 'పేలపిండి'తో నిండిన కుండనొకదాన్ని దానంగా ఇచ్చారు.

అతనికి పేలపిండి అంటే చాలా ఇష్టం. పేలపిండి దానంతో అతని మనస్సు ఉప్పొంగిపోయింది. అలా అతను ఒక చేత్తో పేలపిండి కుండనెత్తుకొని, మరొక చేత్తో ఎక్కువగా తిన్నప్పుడు కలిగే ఆయాసంతో రొప్పుకుంటూ, పొట్ట నిమురుకుంటూ ఊరికి బయలు దేరాడు.

కొంత దూరం పోయాక అతనికి ఒక కుమ్మరి ఇల్లు కనిపించింది. ఆ ఇంటి అరుగు మీద వరసలు వరసలుగా పేర్చి పెట్టిన కుండలు ఉన్నై. వాటి ముందు కంటికి ఇంపుగా కనిపిస్తోంది, ఒకింత ఖాళీ స్థలం! దాన్ని చూడగానే అతనికి ప్రాణం లేచివచ్చినట్లయింది. గబగబా అక్కడికి వెళ్ళాడు; గచ్చుమీద తన ధోవతిని పరచాడు; తలకు చుట్టుకున్న బట్టను తీసి చుట్ట కుదురుగా చేసి ప్రక్కన పెట్టి, దానిమీద తను తెచ్చిన పేలపిండి కుండను కుదురుగా కూర్చోబెట్టాడు; కుక్కలు వగైరాలు వస్తే బెదిరించేందుకని కుడి చేతిలో ఒక కట్టెను పట్టుకున్నాడు; ఎడమ చేతిని తలక్రింద పెట్టుకున్నాడు; పంచెమీద విశ్రాంతిగా పడుకున్నాడు.



చక్కగా కళ్ళు సగం మూసుకొని, ఆలోచన మొదలు పెట్టగానే అతని ఊహలకు రెక్కలు వచ్చాయి- ఇలా అనుకున్నాడు: "ఇదిగో, ఈ సత్తుపిండిని ఇప్పుడే అమ్మను- మంచి ధర పలికినప్పుడు అమ్ముతాను...

అట్లా అమ్మగా వచ్చిన డబ్బుతో ఓ మేకను కొంటాను. అది ఏడాదికి రెండు పిల్లల్ని పెడుతుంది. వాటికి పుట్టిన మేకలు కూడా ఒక్క సంవత్సరంలో పెద్దవైపోతాయి...

అట్లా కొన్నేళ్ళు గడిచేసరికి, అవి అనేక వేలు అవుతాయి. అప్పుడు వాటినన్నిటినీ ఒక్కసారిగా అమ్మేస్తాను. అమ్మేసి నూరు పాడి ఆవులను కొంటాను...

ఆ నూరు ఆవులూ కూడా కొన్నేళ్ళు గడిచేసరికి చాలా దూడలను యీనతాయి. అవన్నీ మందలు మందలుగా వర్థిల్లి, చివరికి మా పెరడు అంతా వాటితోటే నిండిపోతుంది...

అప్పుడు వాటితో గొప్ప వ్యవసాయం చేయిస్తాను. నా పొలాలలో పండిన పంటల్లో కొంత భాగాన్ని అమ్మి లక్షల్లో డబ్బు సంపాదిస్తాను. దానితోపాటు మరికొన్ని కోడె దూడలను కూడా అమ్మి డబ్బు కూడబెడతాను. ఆసరికి నేను ఖచ్చితంగా కోటీశ్వరుడిని అయిపోయి ఉంటాను...

తర్వాత మా ఇంట్లో ఏమూల చూసినా కుప్పలు తిప్పలుగా పడి మూలిగే డబ్బును చూసి, అందరూ 'మేం పిల్లనిస్తాం, మేం పిల్లనిస్తాం' అని నా చుట్టూ తిరిగిపోతుంటారు...

అట్లా వచ్చిన పిల్లలో అందం, చందం ఉన్న అమ్మాయిని ఒకదాన్ని నేను పెళ్ళి చేసుకుంటాను. తర్వాత మాకు మన్మధుడిలాంటి అందమైన కొడుకు ఒకడు పుడతాడు. వాడికి మా 'సోమశర్మ' పేరే పెడతాను. తర్వాత,...

ఇంటి పనులలో సమయం చిక్కక, ఒకరోజున మా ఆవిడ కొడుకును తెచ్చి నా ముందు విడిచిపెట్టి పోతుంది- అమర్యాదగా.

అప్పుడు నేను కోపం పట్టలేక ఆమె వెనుకగా పోయి, నా చేతిలో ఉన్న ఈ కట్టెతో- ఇదిగో- ఇట్లా నాలుగు వాయిస్తాను-" అనుకునేంతలో అతనికి నిజంగానే కొంచెం గమనం తప్పింది- నిజంగానే భార్య వచ్చి ఎదురుగా నిలబడింది అనుకున్నాడు; నిజంగానే కోపం పట్టలేకపోయాడు; నిజంగానే చేతిలో ఉన్న కట్టెతో ఆ పిండి కుండను ముక్కలు ముక్కలుగా దంచి కొట్టాడు!

అతను అట్లా కట్టెను విసిరి కొట్టేటప్పుడు ఆ దెబ్బలలో కొన్ని అక్కడ పేర్చి పెట్టిన కుండలకు తగిలాయి. అవి కూడా టపాలున పగిలాయి!

ఆ చప్పుడు విని అదిరిపడ్డ కుమ్మరివాడు లోపలినుండి పరుగెత్తుకొని వచ్చి చూసాడు.

కోపం ఆపుకోలేక ఆ వెర్రి బ్రాహ్మణుడికి తనూ ఓ నాలుగు దెబ్బలు బహూకరించి;'ఇంకా ఇక్కడుంటే ఏం చేస్తాడో' అని భయపడి అతన్ని త్వరత్వరగా అక్కడినుండి తరిమేశాడు!

కాబట్టి, ఇంకా జరగని పనులను తలచుకొని ఇప్పుడే సంతోషంతో ఉబ్బి తబ్బిబ్బయ్యేవాడు అంతకు ముందు ఉన్నదాన్ని చెడగొట్టు-కోవటమే కాదు; తోటివారిలో కూడా నవ్వుల పాలవుతాడు" అన్నది.

నెమలిరాజు అప్పుడు తన మంత్రిని సాదరంగా చూసి, "దీర్ఘదర్శీ! నువ్వు చెప్పింది అంతా బాగున్నది. నువ్వన్నట్లు, మేఘవర్ణుడు కర్పూర ద్వీప రాజుగా తగడని మేం కూడా అంగీకరిస్తున్నాం. అయితే మరి అక్కడ పాలకుడిగా మనవాళ్లలో ఎవర్ని నియమించచ్చో అది కూడా నువ్వే చెప్పు" అన్నది. (ఎవరు రాజవుతారో మళ్ళీ చూద్దాం...)

## కవితలు

పుస్తకం తోడుగ
గురువుల అండగ
మన్సు నిండుగ
చెయ్ చదువుల పండుగ
పొందు జ్ఞానం మెండుగ
లేనిచో జీవితం దండగ!

**-ఎం. అశ్వర్థనారాయణ గారు, గణిత సహాయకులు, Zphs, గుండువారి పల్లె, తలుపుల మండలం, అనంతపురం జిల్లా.**

పుస్తకం దొరకడం మీకొక వరం
చదవడం కాదేమీ కష్టం
చదవకపోతే మీకే నష్టం
కనుకనే,
చదువుపై చూపండి ఇష్టం
పొందండి పాసయ్యే అదృష్టం
ఫెయిలయితే,
ఉండదు అంతకన్నా దురదృష్టం!



# మిత్ర ద్రోహం

*రచన: ఎ.శిరీష, 8 వ తరగతి, జిల్లా పరిషత్ ఉన్నత పాఠశాల, గుండువారిపల్లె, తలుపుల మండలం, అనంతపురం జిల్లా.*

అనగా అనగా ఒక ఊళ్లో ఒక కోతి, పిల్లి, ఎలుక ఉండేవి. సాధారణంగా పిల్లికి ఎలుకకు పడదు కదా; కానీ ఈ పిల్లి-ఎలుకలు మాత్రం మంచి మిత్రులు.

ఊరి చివరన, అడవికి దగ్గరలో ఇళ్లు కట్టుకున్నాయి అవన్నీ. రోజూ మూడూ కలిసి అడవికి వెళ్ళేవి; వేటికవి తమకు కావలసిన ఆహారాన్ని సంపాదించుకునేవి; ఆనందంగా కాలం గడుపుతూండేవి.

అయితే ఒకసారి ఎండాకాలం, వానలు అస్సలు పడలేదు. అడవంతా ఎండిపోయింది. పిల్లి, ఎలుకలకు పరవాలేదు

గానీ, కోతికి మాత్రం అక్కడ జీవించటం కష్టం అయ్యింది. కోతి కష్టాన్ని గమనించినై, ఎలుక-పిల్లి.

ఒకరోజున, కోతి వింటుండగా అవి రెండూ మాట్లాడుకున్నాయి-"నాకు ఇక్కడ ఆహారం సరిగ్గా దొరకటం లేదు. పట్నానికి పోతే బాగుండుననిపిస్తున్నది" అన్నది పిల్లి.

"నాకూ సమస్యగానే ఉంది; నేనూ వస్తాను" అన్నది ఎలుక.

కోతి మాత్రం ఏమీ మాట్లాడలేదు. దానికీ వెళ్ళాలనిపించింది చాలాసార్లు. అయితే ఆ సంగతి చెబితే పిల్లి-ఎలుక ఏమంటాయో అని అది వాటితో ఇంతవరకు ఆమాట అనలేదు. "నువ్వేమంటావు?" అడిగాయి పిల్లి-ఎలుక.

"కొంచెం ఆలోచించి చెబుతాను" అన్నది కోతి.

మరునాడు కోతి తన నిర్ణయాన్ని ప్రకటించింది: "నేను పట్నానికి వెళ్తున్నాను" అని.

ఎలుక, పిల్లి చాలా సంతోషించాయి. అయితే వాటి మనసు చివుక్కు మన్నది- "మీరు వస్తున్నారుగా?!" అని మాట వరసకైనా అడగలేదు కోతి.

అయినా "ఇంత కాలం కలిసి ఉన్నాం కదా, ఇప్పుడు మాత్రం విడిపోయేదెందుకు?" అనుకొని, పిల్లి-ఎలుక కూడా కోతి వెంట పట్టణానికి బయలు దేరాయి.



ఇంకా పట్టణం చేరకనే, దారిలో కోతికి ఒక బంగారునాణెం దొరికింది. పిల్లి-ఎలుకలకు ఆ నాణెం విలువ తెలీదు గానీ, కోతి చాలా తెలివైనది- "ఇది మీకేమీ పనికి రాదులే, నేను

ఉంచుకుంటాను దీన్ని" అని అది అంటే, "దానిదేముంది, నువ్వే ఉంచుకో. దీంతో ఏం చెయ్యాలో మాకేం తెలుసు?" అన్నాయి పిల్లి-ఎలుక.

కోతి ఆ బంగారు నాణాన్ని పట్టణంలో అమ్మి చాలా డబ్బులు సంపాదించింది. ఒక్కసారిగా వచ్చిన పెద్ద మొత్తంతో వెనువెంటనే అది కాస్తా షావుకారు అయ్యింది.

కోతి వెంట వచ్చిన పిల్లి-ఎలుక అక్కడికి దగ్గర్లోనే వేరే ఎవరి ఇంట్లోనో జీవించటం మొదలు పెట్టాయి. ఆ యింటి వాళ్ళు దయ తలచి పిల్లికి ఇంత అన్నం పెడితే అది దాన్ని ఎలుకతో పంచుకొని తినటం మొదలుపెట్టింది.

పట్నం వచ్చాక, కోతి ఇక పిల్లి-ఎలుకలకేసి చూడనే లేదు. తనకు వచ్చిన డబ్బుతో పెద్ద ఇల్లు కట్టి, చుట్టూ కంచె వేసింది అది!

ఒకసారి పిల్లి-ఎలుక కోతిని చూడడానికని వెళ్ళాయి. కోతికి వాటిని చూస్తే చికాకు అనిపించింది. వాటిమీద కోపం చేసుకొని, నిష్కారణంగా వాటిని కట్టెతో కొట్టి తరిమేసిందది!

దాంతో ఆ చుట్టుపక్కల ఎక్కడా కనబడకుండా వెళ్ళిపోయిన పిల్లి-ఎలుక త్వరలోనే పట్నాన్ని ఏవగించుకున్నాయి. కొన్నాళ్ళకు రెండూ బయలుదేరి తిరిగి పల్లెను చేరుకుని, అడవికి పోయి స్వేచ్ఛగా బ్రతకటం మొదలుపెట్టాయి.



ఇక అక్కడ, పట్నంలో కోతికి ఒక నక్క దొరికింది. ముద్దు ముద్దుగా మాట్లాడి కోతిని బుట్టలో వేసుకున్నది నక్క. కోతి దాన్ని నమ్మి, అదేదో గొప్ప తెలివైనది అనుకున్నది. దానితో స్నేహం చేసింది. కొంత కాలానికి, కోతి తనను

గుడ్డిగా నమ్ముతోంది అని తెలియగానే, నక్క కోతిని మోసగించింది: కోతి దాచుకున్న డబ్బునంతా అది ఒక్క పెట్టున ఎత్తుకెళ్ళి-పోయింది!

డబ్బు ఉన్నంత వరకూ కోతిని గౌరవించిన పట్నం వాళ్ళు, ఇప్పుడు 'దాని దగ్గర డబ్బు లేదు' అనగానే చిన్నచూపు చూడటం మొదలు పెట్టారు. రాను రాను పట్నంలో బ్రతకటం దుర్భరం అయిపోయింది కోతికి. అప్పుడు గానీ దానికి పాత మిత్రులైన పిల్లి-ఎలుక గుర్తురాలేదు.

అయితే అది ఎంత వెతికినా పట్నంలో పిల్లి-ఎలుక కనిపించలేదు. చివరికి మిత్రులకోసం అది పల్లెకు బయలుదేరి పోయింది!

అక్కడ సంతోషంగా జీవిస్తున్న పిల్లి ఎలుకల్ని చూసే సరికి దాని కళ్ళలో నీళ్ళు తిరిగాయి. వాటి దగ్గరకు వెళ్ళి 'క్షమించండి ' అని వేడుకుంది.

అప్పటినుండి మళ్ళీ కోతి, పిల్లి, ఎలుకలు మూడూ స్నేహితులైపోయాయి.

ఆ సరికి వానాకాలం కూడా వచ్చేసింది; అడవి బాగా తయారైంది; దాంతో మూడూ అడవిలో తమకు కావలసిన ఆహారం సంపాదించుకుంటూ సుఖంగా బ్రతికాయి. 

**నవ్వులు**

**ఎగురుదాం!**

టీచర్: ఒరేయ్ బబ్లూ! రాత్రి, పగళ్లు ఎందుకు ఏర్పడుతున్నాయో చెప్పరా?

బబ్లూ: రాత్రి పడుకోవడానికి, పగలేమో తిని ఆడుకోవడానికి ఏర్పడుతున్నాయి సార్!!

**తెలివి!**

తెలుగు అయ్యవారు: పిల్లలూ! శెలవుల్లో నక్షత్రాల పేర్లన్నీ కంఠతా నేర్చుకురమ్మని చెప్పానుగా, నేర్చుకొచ్చారా?

స్టూడెంట్: నక్షత్రాలు అసంఖ్యాకం అని సోషల్ మాస్టారు చెప్పారండీ, అందుకని నేర్చుకోవడం మానేశాం!



# ఓర్పు చేసిన మేలు

*ఇంతమందిమి కలిసి బ్రతుకుతున్నాం కదా, సమస్యలు అనేకం ఎదురవుతుంటాయి మనకు. వీలయినంత మేర సర్దుకొని పోతే, అవి కూడా సర్దుకొని, మళ్ళీ సంతోషం వస్తుంది- ఇదిగో, ఈ కథలో లాగా... !*
*రచన; ఎ.నవ్య రెడ్డి, 9 రోస్, అరవింద హైస్కూల్, కుంచనపల్లి.*

నరసన్నపేటలో గీత అనే ఒక చక్కని అమ్మాయి ఉండేది. గీతకు తోడు నీడగా ఉండేవాడు, వాళ్ల అన్నయ్య మహేష్. మహేష్ చదువు పూర్తి చేసుకుని, కొంతకాలంగా ఉద్యోగం చేస్తున్నాడు. గీతేమో పదో తరగతి చదువుతోంది.

గీత, మహేష్‌లకు అమ్మానాన్నలు లేరు. అన్నా చెల్లెళ్ళే ఇద్దరూ ఒకరికొకరు సాయంగా ఉండేవారు. మహేష్ ఇంటికి కావలసిన సంబారాలు తెచ్చిపెట్టటంతో పాటు గీత బడి ఫీజులు, పుస్తకాల ఖర్చులు అన్నీ తనే చూసుకునేవాడు. గీతకు ఏం కావాలంటే అవి తెచ్చి ఇచ్చేవాడు:

"చదువే మన ఆస్తి చెల్లీ. మనకు వేరే ఆస్తులేమీ లేవు. మనం బాగా చదువుకోవాలి. మంచి పేరు తెచ్చుకోవాలి. సమయాన్ని వృథా

చేసుకోకూడదు" అని ఎప్పుడూ చెబుతుం-డేవాడు మహేశ్. గీతకూడా అన్న మాట జవదాటేది కాదు. చాలా బాగా చదివేది.

సరిగ్గా ఆ సమయంలోనే మహేశ్‌కు పెళ్ళి కుదిరింది. మహేశ్ వ్యక్తిత్వాన్ని, మంచి తనాన్ని చూసి పెద్ద ఇంటి వాళ్ళు ఒకరు తమ అమ్మాయి అంజలిని అతనికిచ్చి వివాహం చేశారు.

కొత్తగా పెళ్లయి ఇంటికొచ్చిన అంజలి మంచిదే కానీ, ఆమెకు కొన్ని ఖరీదైన అలవాట్లు ఉండేవి. భర్త సంపాదన తక్కువ అనీ, ఇంకా చదువుకుంటున్న ఆడపడుచు గీత తమకు బరువనీ అనిపించేది ఆమెకు.

అవన్నీ మనసులో పెట్టుకొని అంజలి గీతపట్ల కఠినంగా వ్యవహరించటం మొదలు పెట్టింది. గీతకు ఆ సమయంలో తన తల్లిదండ్రులు గుర్తుకొచ్చి బాగా ఏడ్చేది. అయినా తన బాధని అన్నతో చెప్పుకునేది కాదు. "రోజంతా ఆఫీసు పనులతో అలసిపోయి, చీకటి పడి ఇంటికొచ్చే అన్నతో బాధ కలిగించే సంగతులు చెప్పేదెందుకు?" అనుకొని, వదిన చేసే అవమానాలను దిగమ్రింగి అణకువగా ఉండేది.



అయినా మహేశ్ గీత చదువుల గురించి ఆలోచిస్తూనే ఉండేవాడు. "గీత చక్కగా చదువుతుంది. నువ్వు కూడా బాగా చదువుకున్నదానివి గదా, కొంచెం తనకు చదువుల్లో సాయం చెయ్యి. నాకు అంతగా వీలవ్వటం లేదు" అని అంజలికి చెబుతూ ఉండేవాడు. అంజలి మాత్రం గీత చదువుల్ని అస్సలు పట్టించుకునేది కాదు. తన లోకంలో తను ఉండేది.

అట్లా కొన్నాళ్ళు జరిగాక, పరీక్షల సమయం

దగ్గరపడింది. "చెల్లె ఎలా చదువుతోందో" అని మహేశ్‌కు ఆరాటం మొదలయింది. అంజలి మాత్రం గీత గురించి అతనికి చాలా చెడ్డగా చెప్పింది: "గీత బాగా చెడిపోయింది. తనకు మార్కులు అస్సలు రావడం లేదు. చెడు సావాసాలకు పోతోంది. రాత్రులు ఇంటికి ఆలస్యంగా వస్తోంది. ఫోన్లు ఎక్కువగా చేస్తోంది.." అని ఇంకా ఏవేవో చెప్పింది. చెల్లెలి మీద చాలా ఆశలు పెట్టుకున్న మహేశ్ మనసు విరిగిపోయింది. అప్పటినుండి ఇక అతనికి గీతతో మాట్లాడటమే ఇష్టం కాలేదు.

ఈ సంగతి తెలిసి గీత చాలా ఏడ్చింది. కానీ చేసేదేమున్నది? పరీక్షల సమయం కదా, ఇవన్నీ పట్టించుకుంటే పరీక్షలు దెబ్బతింటాయి!

అందుకని ఆమె నిబ్బరంగా తన పని తాను చేసుకుంటూ పోయింది: ఇంకా బాగా కష్టపడి చదివింది. ఇప్పుడు తను ఇంటర్ రెండవ సంవత్సరం పరీక్షలు రాసింది. చూస్తూండగానే ఫలితాలు వచ్చాయి: గీతకు రాష్ట్రంలోనే మొదటి ర్యాంకు వచ్చింది!

వార్తా పత్రికలన్నీ గీతను మెచ్చుకుంటూ రాశాయి. గీత చదివిన కాలేజీ వాళ్ళు గీతను, ఇంట్లో వాళ్లను పిలిచి సన్మానం చేశారు. "నా ఈ కృషికి స్ఫూర్తినిచ్చింది ఇద్దరు- ఒకరు మా అన్న, మరొకరు మా వదిన" అని స్టేజీమీద గీత చెబుతుంటే, అంజలి కళ్ళలో నీళ్ళు తిరిగాయి.

స్టేజీ నుండి క్రిందికి రాగానే గీత చేతులు పట్టుకొని, "నన్ను క్షమించు గీతా! నీ గురించి మీ అన్నయ్యకు ఏవేవో కల్పించి చెప్పాను. నీ మంచితనం నా కళ్ళు తెరిపించింది. నీలాంటి పిల్లలు నిజంగా దేవతలు" అని ఏడ్చింది అంజలి.

మహేశ్ గీతను, అంజలిని దగ్గరకు తీసుకొని- "పొరపాట్లు ఎవరైనా చేయచ్చు; వాటిని సవరించుకొని, తిరిగి ఆ తప్పులు చేయకుండా ఉండటమే గొప్ప. ఇకనుండీ మనలో మనకు పొరపొచ్చాలు వద్దు. మనది నిజంగా చల్లని కుటుంబం" అన్నాడు తృప్తిగా. గీత కూడా సంతోషంగా తలాడించింది.



# ఆండ్రోక్లిస్

*అనువాదకథ*

*అనువాద-అనుసరణ: జి.వి.వి.కె.శ్రీకాంత్, 9 ఎల్2, శ్రీచైతన్య టెక్నో స్కూల్, మొగల్రాజపురం, విజయవాడ.*

చాలా కాలం క్రితం గ్రీసు దేశంలో ఒక బానిస ఉండేవాడు. అతని పేరు ఆండ్రోక్లిస్. బానిసల్ని జంతువులకన్నా హీనంగా చూసే రోజులవి. ఇప్పుడు పశువుల సంతలున్నట్లు, ఆ రోజుల్లో బానిసల సంతలుండేవి. బానిసలతోటి యజమానులు ఏ పనైనా చేయించుకోవచ్చు. యజమాని ఏ పని చెబితే బానిస ఆ పని చేయాలి. అట్లా చేయకపోతే చక్రవర్తిగారు బానిసల్ని శిక్షిస్తారు. బానిసలు యజమానినుండి పారిపోయేందుకూ వీలులేదు. సైనికులు పట్టుకుంటారు; పులులకీ, సింహాలకీ ఆహారంగా వేస్తారు.

ఆండ్రోక్లిస్ చాలా మంచివాడు. సున్నిత మనస్కుడు. కొంచెం పెద్దయ్యే సరికి అతనికి తన బానిస బ్రతుకుపైన విరక్తి కలిగింది: 'జీవితం అంటే స్వేచ్ఛగా బ్రతకటమే! స్వేచ్ఛలేని బ్రతుకు వృథా' అని నిశ్చయించుకున్నాడు. యజమాని ఆదమరుపున ఉండగా తెగించి అడవిలోకి పారిపోయాడు!

అట్లా అడవిలో పోతూ ఉంటే, ఒక గుహ బయట అతనికి ఒక సింహం కనిపించింది. అది గర్జించడం లేదు- పెద్దగా ఒకలాగా మూలుగుతోంది. సింహాన్ని చూడగానే ఆండ్రోక్లిస్‌కు భయం వేసింది.

పరుగెడదామనుకున్నాడు. అయితే సింహం బలంగా లేదు- తన వెంట పడటం లేదు! తనపైకి దూకే పరిస్థితుల్లో కూడా అది లేదు! 'ఎందుకు?' అని ఆశ్చర్యం వేసింది అతనికి.



వెనక్కి తిరిగి, మెల్లగా నడచుకుంటూ సింహం దగ్గరకు వెళ్ళాడు. సింహం అతన్ని చూసింది; కానీ కదిలే ప్రయత్నం చెయ్యలేదు. ఆండ్రోక్లిస్ మెల్లగా సింహాన్ని ముట్టుకున్నాడు. అది ఏమీ అనలేదు. పశువులతో పని చేసిన ఆండ్రోక్లిస్‌కు అది ఎందుకనో బాధ పడుతున్నదని అర్థం అయ్యింది. పరీక్షగా చూస్తే దాని కాలు బాగా వాచి ఉంది- పంజాలో పెద్ద ముల్లు గుచ్చుకుని ఉంది- ఆ బాధ వల్ల సింహం నడవలేకుండా ఉన్నది-

స్వతహాగా మంచివాడైన ఆండ్రోక్లిస్ ఇక ఏమీ ఆలోచించలేదు. కూర్చొని, సింహం కాలును తన ఒళ్ళో పెట్టుకొని, జాగ్రత్తగా దాని పంజాలో ఉన్న ముల్లును ఊడబెరికాడు. పంజాకున్న చీమునంతా శుభ్రపరచాడు. వెళ్లి, తనకు తెలిసిన ఆకులు తెచ్చి, పసరు పిండి, కట్టు కట్టాడు. అది తాగేందుకు ఒక దొన్నెలో కాసిని నీళ్ళు తెచ్చి పెట్టాడు. కాసేపటికి, 'ఇక సింహం లేచి తిరగగలదు' అనిపించగానే తను బయటికి వెళ్ళిపోయాడు. అటుపైన అడవిలో చెట్లమీదా, గుహల్లో దాక్కొని, ఎవరికీ కనబడకుండా తిరుగుతూ వచ్చాడు.

అట్లా ఒక రెండు మూడు నెలలు గడిచాయి. అయితే ఎవరైనా ప్రభుత్వం నుండి ఎంతకాలమని తప్పించుకోగలరు? ఒకరోజున అకస్మాత్తుగా ఆండ్రోక్లిస్ యజమాని పంపిన సైనికుల చేతికి దొరికిపోయాడు. ఆండ్రోక్లిస్‌ని విచారించి శిక్షవేయటం చక్రవర్తికి ఏమాత్రం కష్టం కాలేదు. పని ఎగగొట్టి తప్పించుకొని

పారిపోయి, మళ్ళీ దొరికిన బానిసలకు ఎప్పుడూ వేసే శిక్షే ఇతనికి కూడాను! ఇతన్ని పులికో సింహానికో ఆహారంగా వెయ్యాలి! ఆ క్రూర మృగం అతన్ని ముక్కలు ముక్కలు చేసి చప్పరించేస్తుంటే సామాన్య ప్రజలందరూ చూడాలి- 'ఓహో! పారిపోతే తమ గతి కూడా ఇట్లా అవుతుందా!' అని మిగిలిన బానిసలందరూ యజమానులకు అణగి మణిగి ప్రవర్తించేట్లుండాలి, ఇదంతా!

అంతకు కొద్ది రోజుల క్రితం చక్రవర్తి తన పరివారంతో సహా వేటకు వెళ్ళినప్పుడు ఒక సింహం వాళ్ళ మీదికి దూకింది. దృఢంగా, బలంగా ఉన్న ఆ సింహం పంజా దెబ్బలకు ఇద్దరు ముగ్గురు సైనికులు నేలకొరిగారు కూడాను. వాళ్ళకు అది ఒకపట్టాన దొరకలేదుగానీ, మిగిలిన సైనికులు అందరూ కలిసి దాన్ని లొంగదీశారు. ఇనప సంకెళ్ళు వేసి దాన్ని అన్నివైపులనుండీ బిగించారు.

ప్రభువులవారు తమ శౌర్యం ఎంతటిదో ప్రకటించుకోవటం కోసం దాన్ని ఓ బోనులో పెట్టి అడవినుండి పట్నానికి తీసుకొచ్చారు. అడవిలో స్వేచ్ఛగా పెరిగిన ఆ సింహం వీళ్ల మాటలు ఊరికే ఎందుకు వింటుంది? వినలేదు. దగ్గరకొచ్చిన సైనికుడి మీదికల్లా దూకిందది.

దాన్ని క్రుంగదీయటం కోసం చక్రవర్తుల వారు చాలా రోజులుగా దానికి ఎలాంటి ఆహారమూ ఇవ్వలేదు. తిండిపెట్టకుండా ఉంచారు. ఆకలికి మాడి, తిండికోసం తపించి తపించి, చివరికది వాళ్ళు చెప్పినట్లు వింటుంది- సర్కసుల్లో ఉండే క్రూరమృగాలన్నీ అట్లా శిక్షణ పొందినవే గద!

అయితే ఈ సింహం ఇంకా ఎవరి అదుపులోకీ రాలేదు. ఆకలితో నకనకలాడుతున్నది కూడాను; ఎవరు దగ్గరకొస్తే వాళ్ళ మీదికి దూకుతున్నది. పారిపోయి దొరికిన బానిస ఆండ్రోక్లిస్‌ని ఆకలిగొన్న ఆ సింహానికి ఆహారంగా వెయ్యాలని నిర్ణయించబడింది.

ప్రభువుల వారికి ఇదంతా వినోదం. ఆకలిగొన్న సింహం బానిస మీదికి దూకి, కండ కండనూ చీల్చుకొని తింటుంటే వారు వినోదంగా చూసి సంతోష పడతారు. సింహం బలాన్ని

మెచ్చుకుంటారు. అలాంటి సింహం తన ఆధీనంలో ఉన్నందుకు గర్వ పడతారు. ఆ రోజుల్లో చక్రవర్తుల వినోదాలు అలా ఉండేవి.

వినోదం చూడటానికి చక్రవర్తి తన పరివారంతో సహా వచ్చారు. గుంటలాగా ఉన్న గోదా మధ్యలో ఆండ్రోక్లిస్‌ని ఉంచారు. ఫుట్‌బాల్ ఆట చూసేందుకు వచ్చినట్లు, చుట్టూ ప్రేక్షకులు. అందరూ బానిసని వేలెత్తి చూపించారు. ఉమ్మి వేశారు; రాళ్ళు వేశారు. తమ బానిసలకు వాడిని చూపించి భయపెట్టారు.

కొంత సేపటికి సింహం ఉన్న బోనును బరిలోకి తెచ్చారు. బోనులో సింహం క్రోధంతో తిరుగాడుతున్నది. ఆకలి లేనప్పుడు ఎంత ప్రశాంతంగా ఉంటుందో ఆకలిగా ఉన్నప్పుడు అంత భీకరంగా ఉంటుంది సింహం. దాని గర్జనలతో గోదా అంతా ప్రతిధ్వనించింది. ప్రేక్షకులు ఉత్సాహంతో చప్పట్లు చరిచారు. ఈలలు వేశారు. ఆ చప్పుళ్ళకు రెచ్చి పోయిన సింహం 'బోను ఊచల్ని విరిచేస్తుందా' అన్నట్లు రెచ్చిపోయి బోనులోనే కదం తొక్కింది. ప్రాణభయంతో ఆండ్రోక్లిస్ గోదా అవతలి అంచుకు పరుగు పెట్టాడు. అటు ప్రక్కన గోడకు ఒదిగి ముడుచుకొని కూర్చున్నాడు. ప్రేక్షకులంతా వాడిని ఎగతాళిచేశారు. మళ్ళీ ఓసారి రాళ్ల వాన కురిసింది. జనాల అరుపులు-కేకలతో ఆ ప్రదేశం అంతా ప్రతిధ్వనించింది. చక్రవర్తులవారు విలాసంగా నవ్వారు. సింహాన్ని వదలమని సైగ చేశారు.



సైనికులు గోదా పైనుండి కొక్కీలతో బోను తలుపు తెరిచారు. దారి కానక తన్నుకులాడుతున్న సింహం ఒక్కసారిగా గర్జిస్తూ ముందుకు దూకింది. దూరంగా

ఒదిగి కూర్చొని వణికిపోతున్న బానిసవాడిని చూసి, మెరుపులాగా అటు వైపుకు ఉరికింది. ఒక్క క్షణంలో వాడి ముందు వాలింది. అంతటా నిశ్శబ్దం..ఉత్కంఠ. మహోగ్ర కెరటం మాదిరి, అది ఇక బానిస మీదికి విరుచుకు పడాలి..వాడి మెడను విరిచి..

ప్రేక్షకులందరూ చూస్తున్నారు.. చక్రవర్తి, పరివారం, సైనికులు అందరూ ఆ క్షణం కోసం ఎదురు చూస్తున్నారు.. ఆండ్రోక్లిస్ తన ప్రాణాలమీద ఆశ వదిలేసుకున్నాడు..

సింహం బానిస దగ్గరికి వెళ్ళి వాసన చూసింది. వాడి కాలిని నాకింది. ఆండ్రోక్లిస్ కళ్ళు మూసుకున్నాడు- భగవంతుడిని తలచుకుంటూ. కానీ ఆ క్షణం ఎంతకీ రాదేం?! సింహం వాడి చుట్టూ తిరిగింది, మళ్ళీ మళ్ళీవాడి కాలిని నాకింది. వాడి చొక్కాను పట్టుకొని పడేసి, వాడి మీద వాలి, వాడి ముఖాన్ని నాకింది..అటూ ఇటూ ఎగిరి నాట్యం చేసింది. వాడి చేతులు నాకింది.. చివరికి వాడి ఒడిలో ఒదిగి కూర్చొని గారాలు పోయింది!

అప్పుడు గుర్తు పట్టాడు ఆండ్రోక్లిస్- 'ఇది తనకు తెలిసిన సింహమే! తను దాన్ని గుర్తించలేదు గానీ, అది తనను గుర్తించింది! మనుషులలో లేని ప్రేమ,ఆప్యాయతలు దీనిలో ఉన్నాయి. అవును- ఇదీ తనలాగా బానిసే, ప్రేమకు బానిస మరి! బానిసను బానిస గుర్తించటంలో ఆశ్చర్యం ఏమున్నది?' ఆండ్రోక్లిస్ కూడా దాన్ని ప్రేమగా నిమిరాడు.

చక్రవర్తి ఇరకాటంలో పడ్డాడు. 'ఎవరికైనా సరే, ఒక తప్పుకు ఒకసారే శిక్ష వేయాలి' అని ఆ రోజుల్లో నియమం. 'ఇప్పుడు వేరే సింహానికి వీడిని ఆహారంగా వేసేందుకు వీలు లేదు. ఇట్లా ఎందుకు జరిగింది?' ఆయన ఆండ్రోక్లిస్‌ను తన దగ్గరికి పిలిపించుకొని అడిగాడు- 'నీ దగ్గర ఏం మందు ఉన్నది?' అని.

ఆండ్రోక్లిస్ జరిగింది చెప్పి, అన్నాడు- "బానిసలు మాత్రమే తోటి బానిసల్ని, వాళ్ళ బాధల్ని గుర్తించగలరు ప్రభూ"అని.

చక్రవర్తి నిర్ఘాంతపోయాడు. ఆయన నోట మాట రాలేదు. ఆండ్రోక్లిస్ అన్న మాట ఆయన హృదయాన్ని కదిలించింది. 'బానిసలూ

మనుషులేగా, వాళ్లని వేరుగా ఎందుకు చూస్తున్నాం?' అని ప్రశ్నించుకునేట్లు చేసింది.

మరుసటి రోజున ఆండ్రోక్లిస్ బానిసత్వం రద్దు చేయబడింది. సింహానికి కడుపునిండా ఆహారం పెట్టి, దాన్ని అడవిలో వదిలేశారు. గ్రీకు రాజ్యంలో మొదటిసారిగా 'బానిసలూ మనుషులే, వారికీ స్వేచ్ఛ ఉండాలి' అని ఆలోచించటం మొదలైంది.

చాలా సంవత్సరాల తర్వాత అమెరికాలోనూ, యూరప్‌లోనూ బానిసత్వాన్ని నిషేధించేం-దుకు ఆండ్రోక్లిస్ కథ పునాది అయ్యింది.

**పొడుపు కథలు:**

చెంబు నిండా బొగ్గులు- ఏంటవి?

జవాబు: సీతాఫలం!

చాచుకొని చావిట్లో పడుకుంటుంది;

ముడుచుకొని మూలన నక్కుతుంది-

ఏంటది?

**జవాబు:** చాప!

జీడివారి కోడలు

వేడి వారి మరదలు

వైశాఖమాసంలో ఇంటికి తిరిగి వస్తుంది.

ఏంటది?

**జవాబు:** మామిడి పండు!

నూతిలోని పాము-

నూరు వరహాలిచ్చినా బయటికి రాదు!

ఏంటది?

**జవాబు:** నాలుక!

-సేకరణ-సత్యలక్ష్మి, 5వ తరగతి, చెన్నేకొత్తపల్లి

అందరిలోనూ చిన్నవాడు- పెళ్ళికి

పెద్దవాడు ఎవరు?

జవాబు: చిటికెన వేలు!



# చదువుల కోసం

రచన: జి. అనూష, 5 వ తరగతి, ప్రాథమికోన్నత పాఠశాల, టేకుమట్ల, జైపూరు(మం) అదిలాబాద్ జిల్లా.

అనగనగా ఒక ఊళ్లో రామయ్య, రాజమ్మ అనే భార్యాభర్తలు ఉండేవారు. వాళ్ళకి ఒక్కతే కూతురు గౌతమి. రామయ్య, రాజమ్మ ఇద్దరూ కైకిలికి పోయేవాళ్ళు. ఆ రోజుల్లో కూలి బాగా తక్కువ ఉండేది. ఇద్దరూ సంపాదించినా ఇల్లు అతి కష్టం మీద నడిచేది.

గౌతమి కొంచెం పెద్దదయ్యే సరికి, తోటి పిల్లలంతా బడికి పోవటం చూసి, తనూ పోతాననటం మొదలు పెట్టింది.

'కూతురికి చదువంటే ఇష్టం' అని గమనించాడు రాజయ్య. అయితే డబ్బు సమస్య తీవ్రంగా ఉన్నది. ఒకవేళ ఇప్పుడు డబ్బులు కట్టి చేర్పించినా, తర్వాత తర్వాత చదివించే అవకాశం లేదు తనకు. ఒకవేళ ఎలాగో ఒకలాగా చదివించినా, ఆమెకంటే ఎక్కువ చదివిన వాడిని తెచ్చి పెళ్ళిచేయాలి. అదీ

కష్టమే.

అందుకని అతను కూతురు చదువు మాన్పించాడు- ఆమెను కూడా తనతో పాటు పనికి తీసుకెళ్ళాడు. అలా పని చేయగా వచ్చిన డబ్బుల్ని ఆ పాప పేరనే దాస్తూ వచ్చాడు.



అట్లా పనులు చేసుకుంటూ పెరిగింది గౌతమి కానీ ఆమె చదువులంటే ఇష్టాన్ని పోగొట్టుకోలేదు. తను పెద్దయ్యాక, సొంతగా చదివి, పదో తరగతి పరీక్షలు ప్రైవేటుగా కట్టి పాసయ్యింది! రాజయ్య తన కూతురును చూసి గర్వపడ్డాడు గానీ, అంతకు మించి ఏమీ చేయలేదు. గౌతమి తన కష్టాన్ని తనే మనసులో పెట్టుకొని ఉండి పోయింది.

కొన్ని రోజులకి రాజయ్య ఆమెకు పెళ్ళి చేశాడు. గౌతమి భర్త సురేష్ మంచివాడు. డిగ్రీ వరకు చదువుకొని ప్రైవేటు కంపెనీలో ఉద్యోగం చేసే సురేష్ గౌతమిని ఇంకా చదువుకునేందుకు ప్రోత్సహించాడు. దాంతో ఉత్సాహం వచ్చిన గౌతమి దూరవిద్యద్వారా డిగ్రీ పూర్తి చేసింది. తను కూడా సురేష్ వాళ్ల కంపెనీలోనే ఉద్యోగం సంపాదించుకున్నది.

గౌతమికి కూతురు పుట్టేసరికి, వాళ్ళు ఆర్థికంగా నిలద్రొక్కుకున్నారు. పాప వైష్ణవిని బాగా చదివించారు. 'ప్రైవేటు బళ్లలో కంటే మెరుగు' అని ఆ పాపను దగ్గరలో ఉన్న ఒక ప్రభుత్వ బడిలో చేర్పించారు.

ఒకవైపున ఉద్యోగం చేస్తూనే గౌతమి, సురేష్ ఇద్దరూ ఇంకా చదివారు. త్వరలోనే ఇద్దరూ పెద్ద ఉద్యోగాలు తెచ్చుకున్నారు. అలా తాము సంపాదించిన డబ్బుతో అనేకమంది పిల్లల చదువులకోసం సహాయం చేస్తున్నారు. వాళ్ల పాప వైష్ణవి కూడా తల్లిదండ్రుల స్ఫూర్తితో బాగా చదువుతున్నది! 



# పోవుట దొరకుట కొరకే!

*కథనం: చదువుల క్రాంతి,* 10 *వ తరగతి* A, *ప్రభుత్వ ఉన్నత పాఠశాల, టెక్కలి, శ్రీకాకుళం జిల్లా.*

కొత్తపల్లి సంతలో అరటి పళ్ళు అమ్మే గోపాలం నిజాయితీపరుడు. పెళ్ళీడుకొచ్చిన కూతురు ఉంది ఆయనకు. ఆమె పెళ్ళి సంబంధాలకోసం కాలికి బలపం కట్టుకొని తిరిగితే, చివరికో మంచి సంబంధం నిశ్చయం అయ్యింది. పెళ్ళి కొడుకు చిరుద్యోగి- మంచివాడూ, సౌమ్యుడూనూ.

పెళ్ళి ఇంకా కొద్ది రోజుల్లో ఉందనగా గోపాలం కూతురి పెళ్ళి కోసం తను ఇంతకాలంగా కూడబెట్టిన యాభై వేల రూపాయలూ బ్యాంకు నుండి తెచ్చి, ఇంట్లో దాచుకున్నాడు- పెళ్ళి ఖర్చులకు కావాలి కద!

అయితే ఆయన బీరువాలో డబ్బు దాచే సమయంలో ఆయన తమ్ముడి కొడుకు నంద అక్కడే ఉన్నాడు. నందకు పనీ పాటా లేదు; చిన్న చిన్న దురలవాట్లూ ఉన్నాయి. పెదనాన్న డబ్బు దాయటం, బీరువా తాళం చెవులు అక్కడే ఓ ప్రక్కన పెట్టడం చూసి వాడి చెయ్యి ఆగలేదు. గోపాలం బయటకు పోగానే వాడు బీరువా తెరిచి ఆ డబ్బంతా కాజేశాడు!

వాడికి ఊళ్ళో తనలాగే దుబారాగా, అల్లరి చిల్లరగా తిరిగే స్నేహితులు ముగ్గురున్నారు.

పెదనాన్న నుండి కాజేసిన నోట్ల కట్టని ప్యాంటు జేబులో దాచుకొని, వాడు సైకిలెక్కి గబగబా వాళ్ళ ఇళ్ల వైపుగా బయలుదేరాడు. అయితే ఆ హడావిడిలో వాడు చూసుకోలేదు- వాడి జేబుకో పెద్ద కన్నం ఉంది: అందులోంచి ఆ డబ్బులు ఎప్పుడు జారాయో, ఎక్కడ పడిపోయాయో, వాడికి తెలీనే లేదు!



అట్లా పడిపోయిన ఆ నోట్లకట్ట ఒక వర్తకుడికి కనిపించింది. వర్తకుడు ఆశపోతు. అతను గబుక్కున దానిమీద తన చేతి రుమాలు వేసేసి, ఎవరైనా తనను గమనిస్తున్నారేమో అని అటూ-ఇటూ చూశాడు: ఎవ్వరూ చూస్తున్నట్లు లేరు! అతను వెంటనే దాన్ని పైకెత్తి, గబుక్కున తన సంచీలో వేసుకొని, వెనుతిరిగి చూడకుండా ఇల్లు చేరుకున్నాడు. ఇల్లు చేరుకోగానే సంబరం పట్టలేక ఆ డబ్బు కట్టను భార్యకు చూపించాడు. ఒక్కసారిగా అంత డబ్బు దొరకటం చూసి వర్తకుడి భార్య సొమ్మసిల్లి పడిపోయింది!

కొంచెం తేరుకున్నాక వర్తకుడు ఆలోచించాడు: "ఇంత దొంగ సొమ్ము చేతిలో ఉంటే ప్రమాదం. ఎక్కడైనా దాచాలి- ఎక్కడ?" అని. చివరికి అతను పెరట్లో ఒక గొయ్యి త్రవ్వి, డబ్బును అందులో పాతేసి, తృప్తిగా ఊపిరి పీల్చుకున్నాడు.

అయితే అతను అట్లా దేన్నో పాతిపెట్టడం అక్కడే తచ్చాడుతున్న ఒక దొంగ చూడనే చూశాడు. 'ఎంతోకొంత విలువైంది కాకపోతే వర్తకుడు అంత శ్రమ ఎందుకు పడతాడు?' అనుకున్న దొంగ, చీకటి పడేంత వరకూ ఆగి, వ్యాపారి పడుకోగానే పెరట్లో పనికి వంగాడు. త్వరలోనే అతని శ్రమ ఫలించింది: ప్లాస్టిక్ కవర్ చుట్టిన నోట్ల కట్ట అతని చేజిక్కింది! వాడు

కొంత సేపు తన అదృష్టానికి నివ్వెరపోయి, తర్వాత ప్లాస్టిక్ కవర్ తీసి అక్కడే పడేసి, నోట్లకట్టను రొండిన చెక్కుకొని, గోడ దూకి పరుగు మొదలెట్టాడు.

అయితే ఆ రోజున వాడి అదృష్టం సరిగ్గా ఉన్నట్లు లేదు- వీధి కుక్కలన్నీ వాడి వెంటే పడ్డాయి. వాడు ఎటు వెళ్తే అటు కుక్కలు! వాటి అరుపులకు గ్రామంలోని ప్రజలందరూ నిద్రలేచి పరిగెత్తుకు రాసాగారు. ఇక దొరికిపోతానని భయం వేసింది వాడికి. డబ్బుతో దొరికితే జనాలతో కష్టం! అందుకని వాడు నోట్ల కట్టని దారి ప్రక్కనే విసిరేసి, వేరే దిక్కుకు పరుగు పెట్టాడు.

ఆ ఊళ్ళోని రామాలయం పంతులికి తెల్లవారు జామునే స్నానం చేయడం అలవాటు. ఆ రోజున ఆయన అట్లా స్నానం చేసి తిరిగి వస్తుండగా, దారి ప్రక్కనే నోట్లకట్ట కనిపించింది. "అయ్యా! రామా! ఇన్నాళ్ళకు నీ భక్తుడిని కరుణించావా తండ్రీ!" అంటూ ఆనందంగా డబ్బుని తన కండువాలో చుట్టి పెట్టుకొని ఇంటికి తీసుకెళ్ళాడు ఆయన.

ఆయన ఇల్లు చేరుకునే సమయానికి ఇంటి ముందు పెద్ద గుంపు ఒకటి మూగి ఉన్నది: వాళ్లంతా ఆయన చేత పెళ్ళి ముహూర్తాలు పెట్టించుకోటానికి వచ్చిన గ్రామస్తులు. పంతులుగారు కాళ్ళు-చేతులు కడుక్కొని, చేతిలో ఉన్న చెంబును అరుగు మీద పెట్టి, కండువాను ఎవరికీ కనిపించకుండా ఇంట్లోకి తీసుకెళ్ళి, దాన్ని పడక కుర్చీ పైన పెట్టి, ముహూర్తాల వాళ్ళతో మాట్లాడటానికి బయటికి వెళ్ళాడు.

సరిగ్గా అదే సమయానికి పంతులుగారి భార్య బట్టలు ఉతికేందుకు బయలు దేరింది. వెళ్తూ వెళ్తూ ఆవిడ పడక కుర్చీలో పంతులుగారు వేసిన కండువాని కూడా ఎత్తి తన బకెట్ లో వేసుకున్నది- కండువాలో డబ్బు ఉందని ఆమెకు తెలీదుగా?

పంతులుగారి భార్య చాకిరేవుకు చేరుకునే సరికి అక్కడ గోపాలం భార్య శ్రీలక్ష్మి కూడా బట్టలు ఉతుకుతున్నది. ఇద్దరూ అంత:పురం సీరియల్ గురించి కబుర్లాడుతూ బట్టలు ఉతుక్కున్నారు. నోట్ల కట్ట పంతులుగారి

బక్కెట్లోనే పడి ఉన్నది- ఇద్దరూ దాన్ని గమనించలేదు. పని ముగించుకున్నాక, ఇద్దరూ ఎవరికి వాళ్ళు తాము ఉతికిన బట్టల్ని బకెట్లో వేసుకొని ఇంటికెళ్ళారు.



ఆ సమయంలో ఒక పొరపాటు జరిగింది: ఇద్దరి బకెట్లూ ఇత్తడివే. రెండూ ఒకే కాంతం దగ్గర కొన్నవి; ఒకేలాంటివి! దాంతో ఒకరి బకెట్ ఒకరికి వచ్చింది. పంతులుగారి బక్కెట్టు నోట్ల కట్టతోసహా అలా గోపాలంగారి ఇల్లు చేరుకున్నది!

శ్రీలక్ష్మి ఉతికిన బట్టలు ఆరవేస్తుంటే బకెట్ అడుగున డబ్బు కనిపించింది. ఆమె ఆ నోట్లకట్టని చూసి ఆశ్చర్యపోతున్నంతలో గోపాలం గాభరాగా అక్కడికి వచ్చి , "లక్ష్మీ! నిన్న నేను బీరువాలో దాచిన డబ్బు కనిపించట్లేదు, నువ్వు గాని తీశావా?" అంటూనే బకెట్ లో ఉన్న డబ్బుని చూసి - "నువ్వెందుకు తీశావు, దీన్ని? దీని కోసం ఎంత సేపటినుంచి వెతుకుతున్నానో తెలుసా?" అన్నాడు దాన్ని తీసుకుంటూ.

గోపాలం భార్యకు ఆ డబ్బు తన బక్కెట్టులోకి ఎలా వచ్చిందో అర్థం కాలేదు. చివరికి 'పొరపాటున నేనే తీసుకుపోయి ఉంటాను బట్టలతోబాటు- పోయి ఉంటే ఎంత గందరగోళం జరిగేది?!' అనుకొని సంతోష పడ్డది. "ఏమైనా నా అదృష్టం బాగుంది ఇవాళ్ల" అంటూ తెగ నవ్వింది.

అట్లా తిరిగి తిరిగి గోపాలం సొమ్ము గోపాలాన్నే చేరుకున్నది! ఏది ఏమైనా కష్టం చేసి సంపాదించిన సొమ్ము వృధా కాదు. "పోవుట దొరకుట కొరకే" అంటే ఇదే! 

# రైతు-గాడిద

సేకరణ: ఎస్.ఎల్.పి.సాయితేజ. 9 వతరగతి, శ్రీచైతన్యటెక్నో స్కూల్, మొగల్రాజపురం, విజయవాడ.



అనగనగా ఒక ఊళ్లో ఒక రైతు ఉండేవాడు. అతనికి ఒక గాడిద ఉండేది.



గాడిద అతనికి ఎన్నో పనులు చేసిపెడుతుండేది. ప్రతి పనిలోనూ సహాయంగా ఉండేది.



రైతు ఒక రోజున ఎప్పటిలాగే గాడిదను తీసుకొని పొలానికి వెళ్ళాడు. దాన్ని మేత మేసేందుకు వదిలి, తను పొలం పనులు చేసుకోవటం మొదలుపెట్టాడు.

తన పని అయిపోయిన తర్వాత చూస్తే.. గాడిద కనిపించడం లేదు! ఎవరో దాన్ని దొంగిలించారు!





రైతు నేరుగా గ్రామ చావడి దగ్గరికి వెళ్ళాడు. దాదాపు ఊళ్ళోని రైతులందరూ ఆ సమయంలో అక్కడే ఉన్నారు.

"మీరంతా పిరికి పందలురా,...ఒట్టి పనికి మాలిన దొంగలు! నేనుఏమైనా తెలివి తక్కువ వాడిని అనుకుంటున్నారా? నా గాడిదను నాకిచ్చేయండి! లేకుంటే మానాన్న చేసినట్లు చేస్తాను జాగ్రత్త! మళ్ళీ నన్ను అని లాభం లేదు! ముందుగానే చెబుతున్నాను, చూసుకోండి మరి!" అని అక్కడి వారిని బెదిరిస్తూ, నానా హంగామా చేశాడు రైతు.



గాడిదను దొంగిలించిన వాడు కూడా ఆ సమయానికి అక్కడే ఉన్నాడు. రైతు వీరంగాన్ని చూసి, వాడికి భయం వేసింది. వీడే ఇట్లా ఉంటే వీడి తండ్రి ఇంకా ఏమి చేసి ఉండచ్చో దొంగ ఊహకు అందలేదు.



వాడు గబుక్కున పోయి, తను దాచిపెట్టిన గాడిదను తెచ్చి భద్రంగా రైతుకు అప్పగించాడు. "ఇది నీదేనా, ఎవరిదో తెలీక మా దొడ్లో కట్టేశాను" అని బొంకాడు.

తరువాత అడిగాడు- "ఇంతకీ మీ నాన్న ఏం చేశాడు?" అని.

"ఒకసారి మానాన్న గాడిదని ఇలాగే ఇంకోడు ఎత్తుకెళ్ళాడు. అప్పుడు ఆయన ఏం చేశాడో నాకు తప్ప వేరే ఎవ్వరికీ తెలీదు!" అన్నాడు రైతు.



"అదే, ఏం చేశాడు?" అడిగాడు దొంగవాడు, ఉత్కంఠను తట్టుకోలేక.

"ఏముంది, ఆయన ఇంకొక గాడిదని కొనుక్కున్నాడు" జవాబిచ్చి, తన గాడిదను తోలుకొని చక్కా పోయాడు రైతు!

దొంగ నోరు వెళ్ళబెట్టాడు!

# బొమ్మకు కథ రాయండి

***కోదాడ*** *తేజ విద్యాలయంలో పదో తరగతి చదివే* ***హరి చందన*** *ఈ బొమ్మ గీసి పంపించింది: బలే ఉంది.. అయినా ఇదేంటో అర్థం కాలేదు కదూ?! జాగ్రత్తగా చూడండి:*



రెండు చేపలు ఉన్నై.

చేపలు బావిలో ఉన్నాయి.

బావిలో ఒక బంతి కూడా ఉంది.

రాత్రి పూట-

చందమామ ప్రతిబింబం నీళ్ళలో ప్రతిఫలిస్తోంది.

ఒక ప్రతిబింబమేనా?-

రెండో మూడో కావచ్చు!

ఎందుకట్లా?

ఏదో కథ ఉండి ఉంటుంది!

అవును- ఊహిస్తే మీకు ఆ కథ ఏంటో తెలిసిపోతుంది. దాన్ని మాకు రాసి పంపించండి. బాగున్న కథను కొత్తపల్లి-71 లో ప్రచురిస్తాం! మీ కలాలకు పదును పెట్టండి ఇక!

కొత్తపల్లి, 1-127/A, యంఆర్వోఆఫీసు దగ్గర, చెన్నేకొత్తపల్లి, అనంతపురం జిల్లా, ఆం.ప్ర-515101

ఫోను: 7702877670 ఇ-మెయిలు: team@kottapalli.in



# నలుగురు బద్ధకస్తులు

నేపాలీ జానపద కథ

*తెలుగు స్వేచ్ఛానువాదం: నారాయణ, కొత్తపల్లి.*

నలుగురు బద్ధకస్తులు ఒకసారి "విహారంగా కొండపైకి వెళ్ళొద్దాం" అనుకున్నారు. వాళ్ళుండే ఊరికి దగ్గర్లోనే అందమైన ఓ కొండ, చక్కని దట్టమైన అడవి ఉన్నాయి. అటువైపు వెళ్ళేవాళ్ళు ఆ చెట్ల నీడలో విశ్రాంతిగా పడుకోవచ్చు; అడవిలో దొరికే రకరకాల పళ్ళు తినొచ్చు!

అయితే కొండ పైకి ఎక్కటం మాత్రం పెద్ద పనే- కొండ బాగా నిటారుగా ఉంటుంది మరి. అయినా మన బద్ధకస్తులు నలుగురూ వెళ్ళేందుకే నిశ్చయించుకున్నారు. కొండపైకి ఎక్కాక చుట్టూ చూస్తే ఎంత బాగుంటుందో ఊహించుకొనే సరికి వాళ్ళ కాళ్ళు ఆగలేదు.

నలుగురూ వన భోజనాలకు కావలసిన సంబారాలు తీసుకొని బయలుదేరుదా-మనుకున్నారు. అయితే 'న్యాయంగా ఉండాలి కదా, ఎవ్వరి మీదా మిగతా వాళ్ళ కంటే ఎక్కువ బరువు పడకూడదు!' అలా పనులు పంచుకుందామనుకున్నారు. ఎవ్వరూ బద్ధకంలో మిగతా వాళ్ళకు తీసిపోలేదు మరి. అందుకని పనుల పంపకం బాగా కష్టమైంది; చాలా సమయం తీసుకున్నది కూడా. ప్రతివాడూ వీలైనంత తక్కువ పని చేద్దామనుకున్నాడు! చాలా గందరగోళం తర్వాత చివరికి సర్దుబాటు జరిగింది:

"నేను పప్పు తీసుకువస్తాను" అన్నాడు మొదటివాడు.

"నేను బియ్యం!" అన్నాడు రెండోవాడు.

"నేను వంటకు కావలసిన కట్టెలు తెస్తాను!" అన్నాడు మూడోవాడు.

"మరైతే నాలుగవ వాడు వంట చేస్తాడు!" అన్నారు ముగ్గురూ.



నాలుగవవాడికి ఎంత ఆలోచించినా సులభంగా అయ్యే వేరే పని ఏదీ మనసుకు తట్టలేదు. దాంతో వాడు అయిష్టంగానే తల ఊపాడు.

కొండ మీదికి ఎక్కే సరికి మిత్రులు నలుగురూ బాగా అలసిపోయారు. అయినా, ఓసారి ఒప్పుకున్నారు కనుక మొదటి వాళ్ళిద్దరూ బియ్యం, పప్పు తెచ్చి అక్కడ పెట్టారు. మూడోవాడు వెళ్ళి అడవిలో విరిగిన పుల్లా-పుడకా ఏరుకొచ్చారు. నాలుగోవాడు వంట చేశాడు. త్వరలోనే ఖిచిడీ సిద్ధం అయ్యింది. అకస్మాత్తుగా వాళ్ళకి గుర్తొచ్చింది. "ఖిచిడీ లోకి నెయ్యి ఏది?! ఎవ్వరూ తేలేదు!!"

"నెయ్యి లేకుండా ఖిచిడీ బాగుండదు" అన్నాడు నాలుగోవాడు-"ఖిచిడీలోకి నెయ్యి ఉండాల్సిందే. నేనొక్కడినే వంటంతా చేశాను. కాబట్టి నేను వెళ్ళి నెయ్యి తేను!"

"నేనూ తెచ్చే అవకాశమే లేదు- నావంతు పని నేను ముందుగానే చేసేశాను!" అన్నారు ఒకటోవాడూ, రెండోవాడు, మూడోవాడూ - ఒకేసారి.

ఒక్కసారిగా అక్కడ నిశ్శబ్దం అలుముకున్నది. మిత్రులు నలుగురూ మౌనంగా కూర్చొని, ఎవరికి వాళ్లు 'తాము తేకుండా అక్కడికి నెయ్యి ఎట్లా వస్తుందో' ఆలోచిస్తూ ఉండిపోయారు.

ప్రతివాడూ- "నేనే ఎక్కువపని ఎందుకు చెయ్యాలి? వాళ్లనే తెమ్మను!" అనుకుంటూ ఉన్నాడు.

చివరికి మూడోవాడు మాట్లాడాడు: వాడు అన్నాడు- "నాకు తెల్సు. ఇక్కడ మనం అందరం నిశ్శబ్దంగా కూర్చోవటమే అన్నింటిలోకీ గొప్పపని. మనలో ఎవరైతే ముందు మాట్లాడతారో, వాళ్లు వెళ్ళి నెయ్యి తేవాలి!" అని.

మిగిలిన ముగ్గురికీ ఆ సలహా నచ్చింది. 'సరే' అన్నట్లు తల ఊపి, అందరూ ఎవరికి వాళ్లు నిశ్శబ్దంగా, కదలక- మెదలక కూర్చుండిపోయారు. ఎవరికి వాళ్లు 'నేను ముందు మాట్లాడను' అనుకుంటూ పెదాలు బిగపట్టుకుని, పులగపు కుండ చుట్టూ విగ్రహాలలాగా కూర్చొని ఉన్నారు.

అరగంట గడిచింది. అయినా నలుగురిలోనూ ఏ ఒక్కడూ నోరువిప్పలేదు. నోరు విప్పితే నెయ్యి తేవాలి గద!!

అంతలో వాళ్ల వెనకే వచ్చిన కుక్క ఒకటి, అక్కడే కూర్చొని ఆశగా పులగం కుండవైపు చూస్తూనే ఉన్నది. లేచి మంటచుట్టు తిరిగి ముక్కు ఎగరవేసింది. తన అదృష్టాన్ని తనే నమ్మలేకపోయింది అది. మెల్లగా నాలుగు విగ్రహాలకేసీ మార్చి మార్చి చూస్తూ పోయి, కుండలోఉన్న పులగాన్నంతా నాకి శుభ్రంగా తినేసింది! ఆ తర్వాత మెల్లగా వెనక్కి తగ్గి, కొండదిగి ఊర్లోకి పరుగు పెట్టింది!



కుక్క రావటం, తమ కళ్లముందే పులగాన్నంతా తినెయ్యటం- దీన్నంతా మన బద్ధకస్తులు చూస్తూనే ఉన్నారు. కానీ వాళ్లలో ఒక్కరు కూడా ధైర్యం చేసి కుక్కను అదిలించే ప్రయత్నం చెయ్యలేదు. ఎవరు అరిస్తే వాళ్లు

నెయ్యి తేవాలి గద! అందుకని నలుగురూ విగ్రహాల్లాగా, తపస్సులో ఉన్న ఋషుల్లాగా నిశ్చలంగా, ఖాళీ కుండకేసే రెప్పలు ఆర్పకుండా ఊరికే చూస్తూ ఉండిపోయారు. అట్లా కొన్ని గంటలు గడిచి పోయాయి.

మెల్లగా సాయంత్రం అయ్యింది. చుట్టుతా చీకటి అలుముకోసాగింది. అంతలో, దూరంగా తమవైపే వస్తున్న మనిషి ఒకడు కనబడ్డాడు, వాళ్లకి. ఆ వచ్చింది ఒక పోలీసు. పక్క ఊళ్ళో డ్యూటీ ముగించుకొని ఇంటికి తిరిగిపోతున్నాడతను.

అతన్ని చూసికూడా వీళ్లెవ్వరూకదల్లేదు. మంటమీద కుండ, చుట్టూ విగ్రహాల్లాగా వీళ్ళు- వీళ్లని చూడగానే "వీళ్లు దొంగలు" అని నిర్ధారణకు వచ్చేశాడుపోలీసు. 'వీళ్లు ఇక్కడ కూర్చొని ఏదో పథకం రచిస్తున్నారల్లే ఉంది ' అనుకున్నాడతను. అతను ఏమడిగినా, ఎన్ని సార్లు అడిగినా వీళ్లు గుడ్లప్పగించి చూస్తూ ఉండిపోయారు తప్పిస్తే, ఏ ఒక్కడూ నోరు మెదపలేదు. చివరికి అతను "అనుమానాస్పద పరిస్థితుల్లో ఉన్న మిమ్మల్ని నలుగుర్నీ అరెస్టు చేస్తున్నాను- పదండి పోలీసు స్టేషనుకు" అన్నాడు. ఆశ్చర్యం! నలుగురూ ఎవరికి వాళ్ళు లేచి నిలబడ్డారు. ఏమాత్రం ప్రతిఘటించలేదు- పోలీసు వెంట స్టేషనుకుచేరుకున్నారు!



దాంతో వీళ్లంత బాగా రాటుదేలిన నేరస్థులు అని పోలీసుకు నిర్ధారణ అయిపోయింది. స్టేషంలో కూడా అతనెంత గట్టిగా అడిగినా మన బద్ధకస్తులు మటుకు నోరు విప్పలేదు. వీళ్ల అహంకారాన్నీ, దర్పాన్నీ చూసి పోలీసుకు ఒళ్లుమండింది: 'వీళ్లు తన ప్రశ్నల్ని అస్సలు పట్టించుకోవట్లేదు! తన అధికారాన్నే

ధిక్కరిస్తున్నారు! వీళ్లకు గుణపాఠం చెప్పాల్సిందే!" అని అతను లాఠీతో వాళ్ళను వాయించటం మొదలుపెట్టాడు. "కనీసం దెబ్బలకైనా వీళ్లు తమ నేరాన్ని అంగీకరిస్తారు" అనుకున్నాడతను.

మొదటివాడికి రెండులాఠీ దెబ్బలు పడ్డాయి. అయినావాడు పెదవి విప్పలేదు. రెండోవాడికి పోలీసు నాలుగు దెబ్బలువేశాడు. అయినా వాడు 'కుయ్ కుయ్ 'అనలేదు. పోలీసుకు అర్థంకాలేదు.

అతను మూడోవాడినిపిలిచి ఐదు దెబ్బలు వేశాడు. లాభం లేదు. వాడూ నిశ్శబ్దంగా ఓర్చుకున్నాడు తప్పిస్తే నోరు విప్పలేదు. పోలీసుకు మతి పోయినట్లైంది. పిచ్చికోపం కూడా వచ్చింది. నాలుగోవాడిని పిల్చి, "మర్యాదగా సమాధానం చెప్పు. లేదంటే నీకు నలభై లాఠీ దెబ్బలు పడతాయి, చెప్తున్నాను" అని బెదిరించాడు.

నాలుగోవాడు అసంకల్పితంగానే ఎదురు తిరిగాడు- "ఎందుకట్లా? నాకే ఎందుకు నలభై? వాళ్లకేమో తక్కువ, నాకు ఎక్కువా?! ఎందుకట్లా?" అని అడిగేశాడు.

"పోయావు! మాట్లాడేశావు! ఇప్పుడు నెయ్యి నువ్వే తేవాలి వెళ్లి!" అని ఒకేసారి గందరగోళంగా అరవటం మొదలుపెట్టారు మిగిలిన ముగ్గురూ.

కొంతసేపటికి పోలీసుకు కథంతా అర్థమైంది. వీళ్ల బద్ధకాన్ని చూసి అతనికి పొట్ట-చెక్కలయ్యేంత నవ్వు వచ్చింది. నెయ్యి తెచ్చేందుకు బద్ధకం వేసి వాళ్లు అన్నన్ని దెబ్బలకు కూడా ఓర్చుకున్నారు!- ఈ ఆలోచనే అతనికి ఓ అద్భుతంలాగా తోచింది.

"ఒరే! ఈసారి మీరు వన భోజనాలకి వెళ్ళే ముందుగానే పనులన్నీ రాసి పెట్టుకుని సరిగ్గా పంచుకోండి. లేకపోతే మళ్ళీ ఓ సారి రోజంతా ఉపవాసం ఉండాల్సి వస్తుంది; ఆనక స్టేషలో తన్నులు తినాల్సి వస్తుంది. పోలీసుల్లో అందరూ నా అంత మంచివాళ్లు ఉండరు; నేపాల్ లో ఎవరూ మీ అంత బద్ధకస్తులూ ఉండరు!" అన్నాడు అతను, వాళ్లను విడిచిపెడుతూ!





# సింహం-నక్క-ఎలుగుబంటి

*దీనిలాంటి కథే ఒకటి స్కాంద పురాణంలో ఉంది. ఇది చదివాక, మంచి-చెడు, ధర్మం-అధర్మం గురించిన ఆలోచనలు రేకెత్తించే అద్భుతమైన ఆ కథను కూడా చదివి చూడండి!*
*సేకరణ, కథనం: ఆర్.జయరామి రెడ్డి, టైలరు, చెన్నేకొత్తపల్లి, అనంతపురం జిల్లా.*

గండకీ నదీ తీరంలో దట్టమైన ఒక అడవి ఉండేది. ఆ అడవిలో ఒక నక్క-ఎలుగుబంటు చాలా అన్యోన్యంగా ఉండేవి. నక్క ముసలిది- సొంతగా ఆహారం సంపాదించుకునే శక్తి దానికి ఇప్పుడు లేదు. ఎలుగుబంటిది మంచి మనసు. తనకి దొరికిన ఆహారంలో తన మిత్రుడైన నక్కకూ కొంచెం పెట్టేది అది.

ఒకనాడు నక్క , ఎలుగుబంటి కలసి ఆహారం కోసం అడవిలో తిరుగుతూండగా ఆకలిగొన్న సింహం ఒకటి వీటికి ఎదురైంది. పరిస్థితిని గమనించిన ఎలుగుబంటి, నక్కతో "మిత్రమా, నక్కా! నువ్వేమో ఇప్పుడు పెద్దగా ఎటూ కదలలేని పరిస్థితుల్లో ఉన్నావు. ఆ సింహమేమో ఆకలిగొని ఉన్నది; మన వైపే వస్తోంది- దానికి చిక్కామంటే అంతే. అందుకని నువ్వు నా వీపును కరచుకో; నేను ఈ మహావృక్షాన్ని ఎక్కుతాను" అన్నది.

ఆ సరికే భయంతో వణుకుతున్న నక్క ఎలుగుబంటి మాటలు వినగానే తటాలున దాని వీపును కరచుకున్నది. ఎలుగుబంటి చకచకా చెట్టు ఎక్కేసింది!

చెట్టుపైన కొమ్మల్లో ఎలుగుబంటి-నక్క కదలక మెదలక ఉండగా చెట్టుకింద సింహం వాటివైపే చూస్తూ కూర్చున్నది. ఎలుగు-నక్క చెట్టు దిగలేదు. సింహం ఎంతకీ పక్కకు కదలలేదు.



'ఇంక కుదరదు' అనుకున్న ఎలుగుబంటి, చెట్టుపైనే కొన్ని కొమ్మలు విరిచి, పడుకోవడానికి ఒక పక్కను ఏర్పాటుచేసింది. చీకటిపడ్డాక అది నక్కతో- "మిత్రమా! సింహం పంతం కొద్దీ ఇక్కడే కూర్చున్నది. ఇంత పెద్ద చెట్టును అది ఎక్కలేదు. అయినా ఈ రోజంతా మన జాగ్రత్తలో మనం ఉండాలి. మనలో ఒకరు నిద్రిస్తే, ఇంకొకరు కాపలాగా మేలుకొని ఉండాలి" అన్నది.

నక్క సరేనన్నది.

అప్పుడు ఎలుగుబంటి "వయసు పైబడ్డ దానివి- ముందు నువ్వు నిద్రపో. అర్ధరాత్రి దాటాక నిన్ను నిద్ర లేపి, ఆపైన నేను నిద్రపోతాను- నువ్వు కాపలా కాద్దువు" అని నక్కతో అన్నది. నక్క సరేనని గాఢంగా నిద్రపోయింది. ఎలుగుబంటి కాపలా కాస్తూ కూర్చున్నది.

చెట్టుక్రిందనే వీటికోసం ఆశగా ఎదురు చూస్తూ కూర్చున్న సింహం కొంతసేపు అయ్యాక ఎలుగుబంటితో అన్నది- "ఓ మిత్రమా, ఎలుగు బంటీ! నువ్వు ఆ ముసలి నక్కకి కాపరివని నాకు తెలుసు. అయినా నా మాట విను- నువ్వు గానీ ఆ నక్కను కిందకి తోసేశావంటే, నేను దాన్ని తినేసి వేరే అడవికి వెళ్ళి పోతాను. అట్లా నా ఆకలీ తీరుతుంది; నీకు ఆ ముసలినక్కకు ఆహారం తెచ్చిపెట్టే బరువూ తగ్గుతుంది" అని.

ఎలుగుబంటి టక్కున జవాబిచ్చింది- "చూడు, సింహరాజా! ఈ ముసలి నక్క నాకు ఎంత మాత్రమూ భారం కాదు. నేను

తినే ఆహారంలో కొంచెం మాత్రమే దానికి ఇస్తున్నాను. అది నన్నే నమ్ముకుని బ్రతుకుతోంది. నామీద నమ్మకంతో అది ఎంత హాయిగా నిద్రపోతోందో చూడు. ఏ జీవికీ నిద్రాభంగం కలిగించకూడదు. అది మహా పాపం. నిద్రలోనే కదా, అన్ని ప్రాణులూ బడలికను పోగొట్టుకొని హాయినీ, సుఖాన్నీ పొందేది? నేను దీన్ని మోసం చేయటం అసంభవం. ఎన్ని రోజులైనా సరే, నన్ను నమ్మిన ఈ నక్కకు నేను తోడుంటాను" అని.

అంతలోనే రాత్రి మూడవ జాము ప్రవేశించింది. ఎలుగుబంటి నక్కను నిద్రలేపి, తాను పడుకున్నది.

కొంత సేపటికి, ఎలుగుబంటి నిద్రపోయిందని నిర్ధారించుకున్నాక, చెట్టు క్రింద ఉన్న సింహం ఈసారి నక్కను పలకరించింది- "నక్కబావా! నువ్వు మాంసం తిని ఎన్ని రోజులైందో గదా! ఈ ఎలుగుబంటి తను తినదు; నిన్ను తిననివ్వదు- నాకు తెలుసు. నా మాట వింటానంటే ఓ సంగతి చెబుతాను- నువ్వు ధైర్యం తెచ్చుకొని ఆ ఎలుగుబంటిని కిందికి తోసెయ్యి- నేను దాన్ని చంపి తిని, మిగిలిన మాంసాన్ని నీకూ పెడతాను; నువ్వూ తినొచ్చు. మీలో ఎవరినో ఒకరిని తినకుండా ఇక్కడినుండి కదలకూడదని నేను ఎలాగూ నిశ్చయించేసుకున్నాను. నా నిశ్చయం ఎంత దృఢమైనదో నీకు తెలుసు- తెలివైనదానివి- ఆలోచించి నిర్ణయం తీసుకో. ఆ ఎలుగును తోసెయ్యి" అన్నది, నక్కను ప్రలోభపెడుతూ.

నక్క కాసేపు ఆలోచించి- ఎలుగుబంటిని కిందికి తోసేసింది.

కిందపడ్డ ఎలుగు దగ్గరకొచ్చి నిలబడి, సింహం ఎగతాళిగా నవ్వుతూ- "ఎలుగుబంటీ, చూశావా?! ఎంత చెప్పినా నువ్వు ఆ నక్కను కిందికి తోసెయ్యకపోతివే; అది చూడు, నిన్ను ఊరకనే కిందికి తోసేసింది- చూస్తివా, నక్క తెలివి?" అన్నది.

ఎలుగుబంటి విచారంగా నవ్వి, "సింహరాజా! ఆ ముసలినక్క ఎంతో కాలంగా నన్నే నమ్ముకొని బతుకుతోంది. ఈరోజున అదేదో చేసిందని దాని నమ్మకాన్ని నేను వమ్ము చేయను- ఎందుకంటే నామీద నాకు

విశ్వాసం ఉంది. నేను క్రూరజంతువునే; కానీ ఏ ప్రాణికీ కావాలని హాని తలపెట్టను. నా మంచితనం వల్ల నాకు హాని వాటిల్లదు- అనేది నా విశ్వాసం.



నువ్వు నన్ను ఒక్కసారిగా చంపి తిని, నీ ఆకలి తీర్చుకుంటావు- నాకు కలిగే బాధ కేవలం ఆ క్షణం మాత్రమే. కానీ నక్క-?! దానంతట అది క్రిందికి దిగలేదు; మరి చెట్టు మీద దానికి ఆహారమూ దొరకదు. చివరికది ఆకలితో విలవిలలాడుతూ చస్తుంది; లేదా చెట్టు మీది నుండి క్రిందపడి ఎముకలు విరిగి చస్తుంది. ఇది సత్యం.

ఇక ఈ 'నక్క తెలివైనది కాదు' అనేది స్పష్టం. దానికి ఉన్నది కేవలం మోసపూరితమైన ఒక ఆలోచనే తప్ప, తెలివి కాదు. నిజానికి నక్క తిక్కది- అందుకనే ముందుచూపు లేక, ఈ పనికి ఒడి గట్టింది" అన్నది ఎలుగుబంటి, ధైర్యంగా.

"నేను నిన్ను తినకుండా వదిలేస్తాను- మరి ఇప్పుడయినా చెట్టెక్కి నక్కను క్రిందికి తోసేస్తావా?" అంది సింహం.

"అలా చేయను. ఎందుకంటే, 'మోసం చేసినవాడు తనంతట తానే నష్టపోతాడు' అని దీని ద్వారా అందరికీ తెలియాలి" అన్నది ఎలుగు బంటు.

ఇన్ని విషయాలు తెలిసిన నిన్ను తింటే అది నాకు మంచిది కాదు- నాకు వేరే ఆహారం దొరుకుతుందిలే- నీ దారిన నువ్వు పో" అని బయలుదేరింది సింహం. ఎలుగుబంటి కూడా తన దారిన తాను వెళ్ళింది.

నక్క మాత్రం అటు చెట్టు దిగలేక, ఇటు ఆహారమూ లేక అలమటించి, చివరికి క్రిందికి దూకే ప్రయత్నంలో ప్రాణాలు విడిచింది.



# జమీందారుగారి అమ్మాయి

రచన: సి.ప్రణయజ, శ్రీవెంకటేశ్వర బాలకుటీర్, బ్రాడీపేట, గుంటూరు.

మంచితనానికి మారుపేరు, విజయపురి జమీందారు రాజయ్య చౌదరి గారు. . ఆయన భార్య అంజలి అన్ని విధాలా ఆయనకు తగినది- జమీందారుగారు వ్యవసాయం గురించి చూస్తే, ఆమె గ్రామంలోని ఆడవాళ్లను అన్ని విధాలా ప్రోత్సహించేది; అందరికీ అండగా, తలలో నాలుకలా ఉండేది. గ్రామప్రజలంతా వాళ్ళిద్దరినీ ఎంతగానో గౌరవించేవాళ్లు.

అంత చక్కని జమీందారు దంపతులది ఒక్కటే సమస్య. వారి కూతురు రాగమంజరి ప్రవర్తన వారికి పూర్తిగా భిన్నంగా, అతి దురుసుగా, అధర్మంగా ఉండటమే దానికి కారణం.

'రాగమంజరికి చాలా పొగరు' అని ఊరంతా అనుకునేవారు. నిజంగా కూడా 'జమీందార్లం' అన్న గర్వం ఆమె నరనరాల్లో

నిండి ఉండేది; పేదవాళ్లంటే చాలా చులకన భావం ఉండేది; చిన్నా-పెద్దా లేకుండా ఎవరితోటైనా నిర్లక్ష్యంగా ప్రవర్తించేది- అయినా జమీందారుగారి బిడ్డ కనుక ఎవ్వరూ ఆమెను ఏమీ అనలేకపోయేవారు. ఇప్పుడు, ఏడో తరగతికి వచ్చేసరికి, ఆమె మరీ మొండిగా కూడా తయారయింది.



చిన్నది అన్న ఉద్దేశంతో కాబోలు, చౌదరిగారు మొదట్లో ఆ పాపను బాగా ముద్దుచేశారు. దాంతో బడిలో పిల్లలనేకాదు ఉఫాధ్యా- యులనుకూడా ఎంత మాట పడితే అంత మాట అనేయటం నేర్చుకున్నది రాగమంజరి.

రెండు రోజులకు ఒకసారి ఖరీదైన బట్టలు, వస్తువులు కావాలని మారాం చేసేది తను. అందరిముందూ తన గొప్పతనాన్ని చూపించాలనుకుని, ఇంకా చిన్నబోయేది.

ఆ అమ్మాయి బడికి వెళ్ళాలంటే గుర్రపు బండి ఉండాల్సిందే. స్కూలుముందు బండి ఆగిన వెంతనే బండి నడిపే సీతయ్య తాత ఆమె పుస్తకాల సంచీని తీసుకెళ్ళి తరగతి గదిలో పెట్టేవాడు. అలా పెట్టకపోతే ఆమె ఊరుకునేది కాదు.

అట్లాగే, ఆమె క్లాసులోకి వెళ్లేటప్పుడు ఎవ్వరూ ఆమెకు ఎదురురాకూడదు. తెలియక ఎవరైనా ఎదురొస్తే నానా మాటలూ అనేది వాళ్లను. చివరికి "ఈ స్కూలంతా అసలు మాదే. మా తాతగారు కట్టించారు దీన్ని!"అని తల ఎగరేసేది.

"ఎందుకు రాగమంజరీ! అలా అంటావు, తప్పుకదా?!" అని ఉపాధ్యాయులెవరైనా మందలిస్తే ఆ అమ్మాయి వాళ్లను గుడ్లురిమి చూసేది.

ఎప్పుడైనా తల్లి ఆమెకు ఏదైనా మంచి చెప్పబోతే, ఈ పాప తిరగబడేది: "మీ లాగా అందరితోటీ రాసుకు పూసుకు తిరగడం

నాకు ఇష్టం లేదు. నేను గొప్పగా పుట్టాను; గొప్పగానే పెరుగుతాను. మీరు ఎన్ని చెప్పినా అంతే!" అంటూ ఎదిరించి మాట్లాడేది.

"తప్పు తల్లీ! అలా అనకూడదు. డబ్బు శాశ్వతంకాదు. మంచితనంతో ఈ ప్రపంచాన్నే గెలవచ్చు" అని తల్లి, తండ్రి ఎంత చెప్పినా ఆమె వినేది కాదు.



ఒకరోజున రాగమంజరి బడికి బయలు దేరింది. మధ్య దారిలో ఉండగా ఆ పాపకు గుర్తొచ్చింది- 'ఇవాళ్ల తను పెన్ను తెచ్చుకోలేదు'! వెంటనే ఆమె బండి నడిపే సీతయ్యతో "సీతయ్యా! ఇక్కడ బండిని ఆపు. వెనక్కి వెళ్ళి, నాకోసం ఒక పెన్ను కొనుక్కురా" అని ఆజ్ఞాపించింది.

ఆ సమయానికి వాన జోరుగా పడుతోంది. బండిని వదిలి వెళ్తే సీతయ్య తడిసి ముద్దయి పోతాడు. అయినా రాగమంజరి సీతయ్యలాంటి పనివాళ్ల కష్టం-సుఖం పట్టించుకునే పిల్ల కాదు.

ఆ పాప ఆదేశం ప్రకారమే సీతయ్య బండిని బాటకు పక్కగా ఆపి, పెన్ను కొనుక్కురావడానికి పరుగెత్తాడు. ఇంతలోనే ఎక్కడి నుండో పెద్ద డప్పు శబ్దం వినబడ్డది. అది వినగానే గుర్రం బెదిరి, ఇష్టం వచ్చినట్లు పరుగుతీసింది. దాని వెనకే సీతయ్య ఎంత పరుగుతీసినా దాన్ని అందుకోలేక పోయాడు. సమయానికి పక్కన పొలాల్లో పనిచేస్తున్న కూలీలు పరుగున వచ్చారు. నానా తంటాలుపడి చివరికి గుర్రాన్ని ఆపగలిగారు. ప్రమాదం తప్పిందని అందరూ ఊపిరి పీల్చుకున్నారు.

అయితేనేమి, బండి ఒక్కసారిగా ఆగేసరికి, అందులో ఉన్న రాగమంజరి కింద బురదలో

జారి పడబోయింది. తటాలున ఆ పాప పడిపోకుండా పట్టుకున్నారు కొందరు కూలివాళ్లు. ఆ సమయంలో, మరి వాళ్ళ చేతుల మట్టి రాగమంజరి బట్టలకు అంటింది-

అంతే! ఆ అమ్మాయి కోపం కట్టలు తెంచుకున్నది! తనను ముట్టుకున్న కూలి వాళ్ల మీద మండిపడ్డది. వాళ్లను నోటికి వచ్చినట్టు తిట్టింది! పుణ్యానికి పోతే పాపం ఎదురైందన్నట్లు, వాళ్లంతా తప్పు చేసిన వాళ్లలాగా తలలు వంచుకుని, చేతులు కట్టుకుని నిలబడాల్సి వచ్చింది!

సంగతి తెలిసిన జమీందారుగారు తటాలున అక్కడకు చేరుకున్నారు. ఆయన చేరుకునే సమయానికి రాగమంజరి వాళ్లను ఇంకా తిట్టిపోస్తూనే ఉన్నది. ఆ అమ్మాయి మాటలు చూసి జమీందారుగారే అవాక్కయ్యారు.

తమ బిడ్డకు మర్యాదలు తెలియవని ఆయనకు తెలుసు; కానీ మరీ ఇంత నిస్సిగ్గుగా మాట్లాడగలదని ఆయన కలలో కూడా అనుకోలేదు. వెంటనే ఆయన ఆమెను మందలించి, వాళ్ళకు ధన్యవాదాలు చెబుతూ క్షమాపణ కోరాడు.

జమీందారుగారి హృదయాన్ని అర్థం చేసుకొని వాళ్లు కూడా ఆయనకు చేతులెత్తి దండం పెట్టారు. అయితే ఇంటికొచ్చాక, ఇక ఆరోజు రాగమంజరి అలిగి అన్నం తినడం మానేసింది. తల్లి ఎంత బతిమాలినా వినలేదు!

ఇక ఆనాటినుండి బడిలోనూ, బయటా కూడా అందరూ ఆ అమ్మాయిని వెలి వేసినట్లు అయిపోయింది. ఆ పాప కనిపిస్తే చాలు- ఊళ్ళో వాళ్లంతా ఎవరికి వాళ్ళు తప్పుకొని పోసాగారు.

రాగమంజరి దీన్ని గుర్తించిందో లేదో తెలీదు. గుర్తించినా మరి పట్టించుకోలేదేమో; పట్టించుకున్నా అలా పట్టించుకున్నట్లు తెలియనివ్వలేదో, మరి!

రాగమంజరి చదివే తరగతిలోనే సుమతి కూడా చదువుతుంది. సుమతి చాలా పేద పిల్ల. ఆమె తండ్రి పాలేరు. ఆ అమ్మాయికి పాపం సరైన దుస్తులు కూడా ఉండేవి కావు. అయినా ఆ పాప ప్రవర్తనను చూసి అందరూ ఆమెను ఇష్టపడేవాళ్ళు. ఒక్క రాగమంజరికికి

తప్ప, బళ్ళో ఉన్న పిల్లలకు-టీచర్లకు అందరికీ సుమతి అంటే చాలా ఇష్టం ఉండేది. అందరూ ఆమెకు ఏదో ఒక సాయం చేసేవాళ్ళు. కొందరు దుస్తులిచ్చేవాళ్ళు; కొందరు పుస్తకాలు; ఇలా ఎవరికి తోచిన సాయం వాళ్ళు చేస్తుండేవాళ్ళు.

పేదవాళ్ళని భరించలేని రాగమంజరి ఏనాడూ సుమతి వైపు చూడటానికి కూడా ఇష్టపడేది కాదు. తరగతి గదిలో తను ఒక్కతే ముందు బెంచీలో కూర్చొనేది. పేద పిల్లలంతా ఆమెకు దూరంగా, వెనక బెంచీలలో కూర్చునేవాళ్ళు. అయినా తెలివికి పేదరికం, కులం అడ్డు రావుగా? చదువులోనూ, ఆటపాటల్లోనూ సుమతే అందరి కంటే ముందుండేది.

ఇలా ఊళ్ళోవాళ్ళంతా రాగమంజరిని దూరం ఉంచే సమయానికే సరిగ్గా యూనిట్ పరీక్షలు మొదలయ్యాయి. రాగమంజరికి ఒంట్లో నలతగా ఉంది. అయినా మొండిగా పరీక్షలు రాసేందుకు వచ్చింది. ఆమెను ఎవ్వరూ పట్టించుకోలేదు. ఉదయం పరీక్షలు రాయగానే అందరూ బయట చదువుల్లోను ఆటల్లోను పడ్డారు. మధ్యాహ్నం తర్వాత మరో పరీక్ష ఉంది.

ఆనాడు తను తెచ్చుకున్న అన్నం తిని, ఉత్సాహంగా లోపలికి వచ్చిన సుమతి ఒక్కసారిగా ఉలిక్కి పడింది: రాగమంజరి తరగతి గదిలో అపస్మారకంగా పడి ఉన్నది! చలి పుడుతున్నట్లుంది, వణుకుతోంది!

సుమతి పెద్దగా అరిచి పిలిచింది అందరినీ. కొందరు పిల్లలు వచ్చి చూశారు; కానీ ఎవరికి వాళ్ళు తలుపు దగ్గరే నిలబడి పోయారు. రాగమంజరి దగ్గరికి వచ్చేందుకు అందరికీ సంకోచం..!

ఇక లాభం లేదని, సుమతి తానే ఆ పాపను లేవనెత్తి బెంచీమీద పడుకోబెట్టింది. పరుగున వెళ్ళి తమ ఇంట్లోంచే ఒక బొంత తీసుకొచ్చింది- రాగమంజరిమీద కప్పింది.

కబురు జమీందారు గారికి అందింది. ఆయన కంగారుగా వచ్చేసరికి సుమతి రాగమంజరి పాదాలను రుద్దుతోంది. మిగిలిన పిల్లలు, టీచర్లు అందరూ దూరం దూరంగా నిలబడి ఉన్నారు- భయం

భయంగా చూస్తూ!

జమీందారుగారు బిడ్డను తీసుకొని నేరుగా ఆసుపత్రికి వెళ్ళారు. మూడురోజుల పాటు రాగమంజరి ఈ లోకంలో లేదు: ఏదేదో కలవరించింది.

తనకి జ్వరం రావటం, బడిలో పడిపోవటం, ఎవ్వరూ తన దగ్గరికి రాకపోవటం, సుమతి అందరినీ పిలవటం, తనకు రగ్గు కప్పటం, కాళ్ళు రుద్దటం ఇవన్నీ ఆమెను వద్దన్నా వెంటాడాయి. సుమతి మంచితనం ఆమె మనసును తట్టి లేపింది.

జ్వరం తగ్గే సరికి రాగమంజరి చాలా మారిపోయింది. తనలో ఉన్న గర్వం, అహంభావం అన్నీ తొలగిపోయాయి. సుమతి చేసిన సహాయం ఆమెకు కనువిప్పు కలిగించింది.

తన ఆరోగ్యంకాస్త కుదుటపడగానే బడికెళ్ళి సుమతి చేతులు పట్టుకొని "సుమతీ, నువ్వు చాలా మంచిదానివి; తెలివైనదానివి కూడా. చాలా సార్లు నేను నిన్ను అవమానించాను. అవేమీ మనసులో పెట్టుకోకుండా ఆపదలో ఉన్న నాకు సాయం చేశావు నువ్వు.



నువ్వెంత మంచిదానివో నాకు అర్థమైంది. నా తప్పు కూడా నాకు తెలిసి వచ్చింది. ఇక మీదట అందరితోటీ మర్యాదగా ప్రవర్తిస్తాను; స్నేహంగా ఉంటాను. నన్ను క్షమించండి" అని కళ్ళనీళ్ళు పెట్టుకుంటున్న రాగమంజరిని చూసి అక్కడివాళ్లు తమ చెవులను తామే నమ్మలేకపోయారు. అటుపైన నిజంగానే రాగమంజరి అందరికీ ఇష్టం అయ్యింది. "జమీందారుగారి అమ్మాయి, ఎంత మంచిది!” అనిపించుకున్నది.



# సులభమైన సాంఘిక!

*రచన: ఆదూరి హైమవతి, విశ్రాంత ప్రధానోపాధ్యాయిని, బెంగుళూరు.*

"ఏమర్రా, పిల్లలూ! ఎండలో తిరక్కండి!" అంటూ పిల్లల్ని మందలించారు తాతయ్య- ఎండలో ఆడుకుని వడదెబ్బ తిన్నంత పనైన పావనిని చూస్తూ.

"ఏంచేయమంటావ్ తాతా! శలవుల్లో తోచదాయె; నువ్వేమో ఎండ- ఎండ అంటావు, బలే తిప్పలొచ్చిపడ్డాయి!" అంటూ విసుక్కున్నారు పిల్లలు.

"ఓరోరీ! తోచకపోవటానికి ఏముందోయ్! ఏదో ఒక కొత్తపని మొదలెట్టేస్తే సరి. అదీ మీకు ఉపయోగంగా ఉండాలి, తెలివిని పెంచాలి, భవిష్యత్తులో ఉపయోగ పడాలి. అలాంటి పని ఒకటి చెప్తాను చేస్తారేంట్రా?" అంటూ తాత ఆగాడు.

" ఓ తప్పక చేసేస్తాం, చెప్పు తాతా !" అంటూ తాత చుట్టూ చేరారు పిల్లలంతా.

"ముందుగా మీరు వేసవి శలవుల తర్వాత వెళ్ళే క్లాస్ పుస్తకాలు సంపాదించి పెట్టుకోవాలి.."

తాత మాటలు పూర్తవందే "ఓహో, అవి ఎప్పుడో సంపాదించేశాం. వేసవి తర్వాత కొత్త పుస్తకాలు అచ్చై రావటం, కొత్తగా ఏ ప్రభుత్వం వస్తుందో, పుస్తకాలెప్పుడు ప్రింటవుతాయో ఎవ్వరికీ తెలీదుగనుక, మా మాస్టార్లందరూ పై తరగతుల పిల్లల పుస్తకాలు సేకరించి మా

అందరికీ పంచేశారు. కొందరికైతే కొత్త పుస్తకాలు కూడా దొరికాయి"

"మరి చెప్పరేం! మీ పంతుళ్ళు చాలా తెలివైనవారూ, ఆలోచనాపరులూ, రాబోయే ఇబ్బందులన్నీ తెలిసినవారూనూ! సరి సరి- ఆ పుస్తకాలు తీసుకురండి. మీరు వెళ్లబోయే తరగతి పాఠాలు తీయండి. అందులోనూ మీకు అంతగా ఇష్టంలేని సబ్జెక్ట్ తీసుకురండి" అన్నారు తాతగారు సర్దుకు కూర్చుంటూ.



" ఇవిగోండి తాతగారూ!" బిలబిల మంటూ పిల్లలంతా తమ క్లాస్ పుస్తకాలు తీసుకుని వచ్చారు.

"పిల్లలూ! మీరు మీకు అంతగా ఇష్టంలేని సబ్జెక్ట్ పుస్తకాలు తీయండి!"

"తాతగారూ ! మాకు పరిసరాల విజ్ఞానం పెద్ద బోర్! ఆ మ్యాప్ పాయింటింగ్స్ , నదులూ, సముద్రాలూ, పర్వతాలూ, నగరాలూ, అవన్నీ ఇప్పుడు వద్దు బాబోయ్!" అంటూ తలలు పట్టుకున్నారు.

"మంచిదైందిరా ! మీ అందరికీ ఒకే సబ్జెక్ట్ బోరవటం మేలైంది. ఏదీ మీ అట్లాస్‌లు తీయండి!" అని మొదలెట్టి నెట్టారు తాతగారు.

ఒకవైపు అయిష్టంగానే ఉన్నా, తాతగారి మీద గౌరవం కొద్దీ "ఇవిగోండి తాతగారూ!" అంటూ పిల్లలంతా అట్లాసులు తెరిచారు.

తాతగారు వాళ్ళందరినీ ముందుగా దేశ-పటాలు తీయమన్నారు- "పిల్లలూ ! ముందు మీరంతా మీ దగ్గరున్న దేశపటంలో చూసి, మీకు కనిపించే రకరకాల నదుల పేర్లూ, అవి పుట్టే ప్రదేశాల పేర్లూ, ప్రవహించే పట్టణాల పేర్లూ రాయండి- ఎవరికి వారే వెతికి రాయాలి, కాపీ కొట్టకండి- మీకు అర్ధ గంట సమయం

ఇస్తున్నాను" అన్నారు.

అంతా తలో మూలా కూర్చుని చకచకా తమ అట్లాసులు తెరిచి నదులు ఏవేవి- ఎక్కడెక్కడున్నాయో వెతికి రాయటం మొదలుపెట్టారు.

"ఇంకా పదినిముషాలే .. ఐదునిముషాలే.. ఒక్క నిముషమే..ఇక ఆపేయండి" అని కామెంటరీ చెబుతూ అందర్నీ ఉత్సాహపరుస్తూపోయాడు తాతయ్య.

"ఇప్పుడు ఎవరు- ఎన్ని నదుల గురించి- వ్రాశారో చూద్దాం" అని అందరి పుస్తకాలూ చూసిన తాతయ్య రమేష్‌ను బలే మెచ్చుకున్నాడు- "ఒరేయ్! పరిసరాల విజ్ఞానం అంటే బోర్ అన్న మొదటివాడివి, అందరికంటే బాగా రాశావు కదరా!" అని. పిల్లలందరూ నవ్వారు.

తాతయ్య చెప్పాడు- "చూడండి, ఇట్లా మనకు ఏ సబ్జెక్టు బోరో, దాని మీదే పనిచేసి, మనకు ఇష్టమైన దానిగా మలచుకోవాలి, ఇలాగ!" అని.

అలా పిల్లలంతా ఒకరోజున రైల్వేస్టేషన్ల గురించీ, మరో రోజున రోడ్డు మార్గాల గురించీ, ఇంకో రోజున నగరాల గురించీ, ఖండాలూ, సముద్రాల గురించీ- అట్లాసులో చూసి కనుక్కొని రాసారు. అందరికీ బాగానే అనిపించింది. ఆశ్చర్యం- ఎవ్వరికీ బోరు కొట్టలేదు!



వేసవి సెలవలు ముగిసి బళ్ళు తెరిచేసరికి పిల్లలందరికీ సాంఘిక శాస్త్రమేకాదు- సైన్స్ లో బొమ్మలూ, గణితంలో సమస్యలూ, డిక్షనరీ చూసి ఇంగ్లీషు పదాల అర్థాలు కనుక్కోవటం, కొత్త మాటల అర్థాలు వెతుక్కోడం- అన్నీ తెలిశాయి.

బళ్ళు తెరిచే రోజున పిల్లలంతా తాత గారికి ఇష్టమైన మెత్తని జామ పండ్లు తెచ్చిచ్చి- "తాతా! ఈ వేసవి మాకెంతో సరదాగా గడిచింది. అసలు పరిసరాల విజ్ఞానం ఇంత బాగుంటుందని మాకు తెలీనే తెలీదు- ఇప్పుడు మాకు అన్ని సబ్జెక్టులలోకీ ఇదంటేనే ఎక్కువ ఇష్టం అయ్యేట్లుంది!" అని చెప్పారు.

"ఓరీ, నేను విశ్రాంత ఉపాధ్యాయుడినని మరచిపోయారట్రా?!

40 ఏళ్ళపాటు బడిపంతులుగా మీలాంటి ఎందరో పిల్లలకు కష్టమైన దాన్ని ఇష్టంగా చేసుకునేదెలాగో చెప్పినవాడ్నిరా" అంటూ బోసి నవ్వు నవ్వుతున్న తాతను చూసి, తామూ నవ్వారు పిల్లలంతా.

## గుమ్మడి కాయ దొంగ!

అమ్మ: కొత్తగేటుకు ఆ మరకలు ఏంటిరా, రవీ?!

రవి: నాకు తెలీదమ్మా! రాము `చేసుంటాడు!

అమ్మ: రామూ! ఏంట్రా ఆ మరకకలు, ఎందుకు చేశావు?

రాము: నేనసలు గేటును కాలితో తన్ననే లేదమ్మా!?

నవ్వు!

## అతి మరపు

భార్య: ఏమండీ, షాపులో మనం ఏదో మరచిపోయినట్టున్నామండీ!!

భర్త: ఏంమర్చిపోయాం? నగలుగానీ మరిచిపోయావా?

భార్య: అంత ఇష్టంతో కొన్నవాటిని ఎలా మరచిపోతానండీ..!

భర్త: మరింకేం మరిచి పోయామే?!

భార్య: మన పాపనండీ..!

## బట్టీ మాస్టరు!

టీచర్: సాత్విక్, మన దేశానికి బ్రిటీష్ వాళ్ళు ఎప్పుడు వచ్చారు, ఎప్పుడు వెళ్ళారు?

సాత్విక్: సోషల్ పుస్తకంలో 67 వ పేజీలో వచ్చి 90 లో వెళ్ళిపోయారు టీచర్!!

-దొండటి శరత్ రెడ్డి, 9వ తరగతి, ఉషోదయ ఇంగ్లీష్ మీడియం స్కూల్, చౌడవరం, గుంటూరు జిల్లా.

# పదరంగం-69

నిర్వహణ: కొత్తపల్లి

| | | | | | |
|---|---|---|---|---|---|
| 1 | | 2 | 3 | | 4 |
| | | 5 | | 6 | |
| 7 | | | | 8 | |
| | | | 9 | | |
| 10 | 11 | 12 | | | 13 |
| | 14 | | | | |

## అడ్డం

1.జోరుగా కురిసే వాన! (4)

5. 'దేశమును ప్రేమించిన' అప్పారావు గారు (4)

7. బళ్ళో చెప్పేవి (3)

8. అర్జునుడికి కృష్ణుడు ఏమవుతాడు? (2)

9. మన చుట్టూ అంతటా ఉండేది! (2)

10. అద్దంలో చూసుకోగానే కనబడేది?! (3)

14. రంగు+అద్దాలు! (5)

## నిలువు

1. కొండల పైనుండి దూకే నీళ్ళు!(5)

2. ఇవి ఉరకలు వేస్తూ పారతాయట! (3)

3. సున్న పోయిన నరం' (2)

4. నీళ్ళలో తేలుతూ పోతుంది ఇది! (3)

6. ఒక ఋషి- మారిపోయిన జాబిలి! (5)

11. ఇదంటే గాడిద! (2)

12. ఒత్తు లేని ముగ్గు! (2)

13. సంపూర్ణాహారం! (2)

అడ్డం-నిలువు ఆధారాల సహాయంతో ఈ గడులను నింపగలరేమో చూడండి. నింపిన పదరంగాన్ని, కేవలం పోస్టుకార్డుపై రాసి, మాకు అందేట్లు పంపండి. మీ బడి పేరు, తరగతి, మీవాళ్ల ఫోను నంబరు తప్పక రాయండి. సరైన సమాధానం రాసి ఎంపికైన ముగ్గురు పిల్లలకు కొత్తపల్లి-70 ని బహుమతిగా పంపిస్తాం!

కొత్తపల్లి ప్రచురణలు, 1-127/A, యంఆర్‌వో ఆఫీసు దగ్గర, చెన్నేకొత్తపల్లి, అనంతపురం జిల్లా-515101

# పదాల్ని వెతికి పట్టుకోండి!

**ప్రయోగాలు, రాజధాని, గ్రంథాలయం, నీతి, చెరకు, అమాయకుడు, పరుగు పందెం, ఉపయోగం, సినిమా , చెరువు, పిసినారి, ఉపకారం, కోడిపుంజు, హైదరాబాద్, పని మనిషి, సంతోషం, నిజాయితీ, రాజాధిరాజా, బహుమతి, అనసూయ.**

పైపదాలు ఈక్రింది పట్టికలో దాగున్నాయి- నిలువుగా, అడ్డంగా, వాలుగా, క్రిందినుండి పైకి- ఎటుపడితే అటు! వాటిని వెతికి పట్టుకోండి. వాటి చుట్టూ **గుండ్రాలు గీయండి!**

| | | | | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| సి | హై | పుం | ఉ | న | దెం | పుం | హు | ధా | సం | జు | తో |
| ని | డి | ద | పం | ప | సం | కో | లు | చె | రా | వు | డు |
| కో | తో | చె | రా | సూ | యో | గా | సం | ధి | రు | కు | హు |
| సం | ర | గ్రం | థా | బా | యో | గం | జా | తో | య | బ | ఉ |
| కు | ప | సి | పుం | ప్ర | దు | రా | డి | మా | షం | వు | పం |
| రా | జా | ని | రి | నా | సి | పి | అ | ధా | గ్రం | రు | చె |
| కో | హై | మా | మ | ధి | రా | జ | ధా | ని | రం | చె | ఉ |
| డి | కా | దెం | కో | ని | జా | యి | తీ | సూ | ఉ | హు | జా |
| పుం | యం | చె | పం | ఉ | షి | య | థా | తి | నీ | రా | ఉ |
| జు | ల | పం | హు | గు | సూ | రం | మ | పి | లి | ప | కా |
| దెం | థా | మ | ని | న | రు | హు | ధా | దెం | కా | పం | సి |
| ఉ | గ్రం | పి | అ | కా | బ | ప | ఉ | రం | నీ | కా | పి |



# దయ్యాలు

చర్చ

"ఒరేయ్! దయ్యాలున్నాయట్రా?" అడిగాడు సోము, చంద్రాన్ని.

"లేవు" చెప్పాడు చంద్రం, ఖచ్చితంగా

"ఎట్లా తెలుసురా, నీకు?" అడిగాడు సోము.

"ఎట్లా ఏముంది?! తెలుసు, అంతే!" అన్నాడు చంద్రం "మన ఊరవతల కరెంటు తీగలున్నాయి చూడు-" అని జోడిస్తూ.

"ఉన్నాయిగా! మనం అందరం పోయి అవి 'గుయ్-గుయ్' అని పాడుతుంటే విన్నాం, గుంపుగా దాక్కుని!" చెప్పాడు సోము "అయితేనేమి?" అంటూ.

"అవును కదా! అవి పాటలు పాడేది ఎందుకనుకుంటున్నావు? ఊళ్ళలో ఉన్న దయ్యాలన్నీ ఆ

పాటలు విని, వాటి చుట్టూ చేరేందుకు పరుగులు పెడతాయి. ఒక్క సారి ఆ తీగలను అంటితే చాలు- అవి ఇంక వాటికే అతుక్కుపోయి, నల్లగా మాడి, మసైపోతాయి. అట్లా ఒకటీ, రెండూ కాదట, వేలకు వేల దయ్యాలు బూడిదైపోయాయట, తెలుసా?"

"ఊఁ.." అన్నాడు సోము, సాలోచనగా "అందుకేనా, మరి ఇంజనీర్లు ఎవ్వరూ దయ్యాలంటే భయపడరు?!" అని అడిగాడు స్వగతంలో మాదిరి చిన్నగొంతుతో.

"మరెందుకనుకున్నావు? దయ్యాలంటే నిజానికి వాళ్ళకీ భయమే. అయితే వాళ్ళని ఏమైనా చేసేముందే అవన్నీ వెళ్ళి తీగలకి అతుక్కుంటాయని తెలుసు, వాళ్ళకి" చెప్పాడు చంద్రం, మరింత తెలిసినట్లు.



"అవున్రా. మరి అప్పుడోసారి కరెంటు పోయింది చూడు- రెండు రోజులు వరసగా కరెంటు లేదు. అప్పుడు ఏమై ఉంటుంది?" సోముకి సందేహం.

"ఓరి పిచ్చి ముఖమా, 'ఇప్పటికే దయ్యాలన్నీ మాడి మసైపోయినాయిరా' అంటే, ఇప్పుడింక కరెంటు పోతే మాత్రంఏం?" నవ్వాడు చంద్రం, గమ్మత్తుగా.

"అన్నీ చచ్చిపోయాయంటావా, ఒక్కటీ మిగలకుండా?!"

"ఒక్కటి గూడా లేదు. అటు కరెంటు తీగలొచ్చాయి; ఇటు వాటి పనైపోయింది- అంతే!"

మాట్లాడుకుంటూ వస్తున్నారు సోము, చంద్రం, పారుగూరు నుండి. అప్పుడపుడే చీకటి

పడుతున్నది. చెట్ల చివర్లలో మాత్రం సూర్యుడి వెలుతురు పడుతున్నది- అవి పచ్చగా,ఎర్రగా మెరుస్తున్నాయి. మిగిలిన భాగాలన్నిటినీ చీకటి కొద్ది కొద్దిగా మింగేస్తోంది. నీడలన్నీ పరచుకొని గాలికి ఊగుతుంటే వాతావరణం ఏదోలా అనిపిస్తున్నది.

దూరంగా, ఊరివైపుగా, చింత చెట్టొకటి, ఎడారిలో ఒంటరి పక్షిలాగా నిలబడి ఉంది. దానినుండి తెల్లగా ఏదో వేళ్ళాడుతున్నది. దాన్ని చూడగానే పిల్లలిద్దరూ ఠక్కున ఆగిపోయారు- సోము గబుక్కున చంద్రం చెయ్యి పట్టుకున్నాడు- "లేవన్నావుగా?! చూడు! ఇప్పుడేం చేద్దాం?! వెనక్కి తిరిగి పారిపోదామా?!" గుసగుసగా, ఏడుపు గొంతుతో అన్నాడు.

చంద్రం మాట్లాడలేదు. వాడి గొంతు పెగలటం లేదు. "ఎటుపోతాం? ఊళ్ళోకి పోవాలంటే మళ్ళీ ఇటువైపు రావాల్సిందేగా?" అన్నాడు మెల్లగా.



అంతలో ఈదురు గాలి వీచింది. దూరంగా సుడి చుట్టుకొని దుమ్మంతా పైకి ఎగిరింది.

కెవ్వున అరిచాడు సోము-"ఇదిగో, చూడు! చింతచెట్టుకంటే పైకి ఎగిరిందది!" అని. పిల్లలిద్దరి కాళ్ళూ నేలకి అతుక్కుపోయినై. ఇక కదల్లేకపోయారు. అంతలో తెల్లటి ఆ ఆకారం నిజంగానే గాలిలోకి ఎగిరి వీళ్లవైపుకు దూసుకు వచ్చింది. రెక్కలల్లార్చుకుంటూ ఎగిరొచ్చి చంద్రం ముఖాన్ని ఠపాలున కొట్టింది! పిల్లలిద్దరూ వణికిపోతూ గట్టిగా అరిచారు-

అంతలో ఎవరిదో గొంతు వినబడింది గట్టిగా, -ఏమీ లేదమ్మా, భయపడకండి. ఇది ఒట్టి బట్ట.

గాలిగి ఎగిరి వచ్చిందంతే!" అని చంద్రం ముఖానికి అంటుకొని ఉన్న బట్టను తొలగించారు. చూడగా, ఆ వచ్చింది సూర్యారావు మాస్టారు. పిల్లలిద్దరూ భయంతోవణుకుతూ ఆయన కాళ్లని చుట్టేసుకున్నారు. ఆయన వాళ్ల వీపులు తడుతూ "ఒట్టి బట్టే కదా! అంత భయపడాల్సింది ఏముంది?" అన్నారు.

"దయ్యం అనుకున్నాం సార్!" పిల్లలు చెప్పారు కొంతసేపటికి.

"దయ్యాలు అంటూ బయట అస్సలు లేవురా! ఉంటే గింటే అవి మన లోపల ఉన్నై- భయాలుగాను, ఆలోచనలు గాను! మనం ఎంత భయపడతామో, అవి ఆలోచనలుగా మనల్ని అంత భయపెడతాయి. భయం పోవాలంతే జ్ఞానం పెంచుకోవాలి. మనకి తెలిసిన సంగతులు పెరిగిన కొద్దీ తెలీనివి తగ్గిపోతాయిగా, ఎలాగూ?! అట్లా మన భయాలూ పోతై; దయ్యాలూ పోతై " అన్నారు సూర్యారావుగారు.

"మరి, అవి కరెంటు తీగలకి తగులుకోవా..?" అడిగాడు చంద్రం.

ముందు ఆ ప్రశ్న సూర్యారావుగారికి అర్థం కాలేదు. అర్థమయ్యాక పడీ పడీ నవ్వారు- "కరెంటు తీగలమీద వాలి ఉండే పక్షుల్ని చూడలేదా? వాటికి ఏమౌతున్నది? కరెంటు తీగలు వాటినే ఏమీ చేయట్లేదే, మరి మీరనే దయ్యాల్ని ఏం చేస్తాయట?!"

"అవునే! నాకు గుర్తుకే రాలేదు ఈ సంగతి!" నవ్వాడు చంద్రం- "అంటే మనకూ ఏం కాదా, కరెంటు తీగల్ని పట్టుకుంటే?!"

"జాగ్రత్త నాయనా! అట్లాంటి పిచ్చి పనులు చెయ్యకు! మనం కరెంటు తీగను పట్టుకుంటే కరెంటు మనగుండా ప్రవహించి, నేలను చేరుకుంటుంది; అందువల్ల మనకు పెద్దషాక్ కొడుతుంది. కానీ పక్షులు వచ్చి కరెంటు తీగల మీద వాలితే వాటికి ఏమీ కాదు- ఎందుకనో చెప్పు, చూద్దాం?"

"అవి నేలను తగిలి లేవుగా?!" అర్థమైనట్లు చెప్పాడు చంద్రం.

"అవును. ఒక్కోసారి తెలీక ఏదైనా పిట్ట ఒక తీగమీద వాలి, ఇంకో తీగను గానీ, స్తంభాన్నిగానీ తగిలిందనుకో, అప్పుడు దానిగుండా కరెంటు ప్రవహించి, దాని శరీరం కాలిపోతుంది; అది చచ్చిపోతుంది!

"అవునవును. తీగలకి వ్రేలాడే పక్షి శరీరాల్ని చూశాను చాలాచోట్ల!" అన్నారు పిల్లలిద్దరూ, ఒకేసారి.

"ఇన్నాళ్ళూ వాటిని దయ్యాలే చంపాయనుకున్నాను!" అన్నాడు సోము ముఖం వేళ్ళాడేసుకొని.

"అనుమానం తీరిందిగా, ఇప్పుడు హాయిగా నవ్వు!"అన్నారు సూర్యారావుగారు, తనూ నవ్వుతూ.



**తుఫాన్!!**

నాన్న: ఒరేయ్, తుఫాను అంటే ఏంటో నీకు తెలుసారా?

కొడుకు: అమ్మకు కోపం రావటమే కదా నాన్నా!!

నవ్వు!

**వేడి!!**

టీచర్: పిల్లలూ శెలవులు ఎలా గడిచాయర్రా?

స్టుడెంట్: ఉఫ్...చాలా వేడిగా గడిచాయి టీచర్!!

టీచర్: రేయ్ చింటూ, ఋతువులెన్ని రా?:

చింటు: నాలుగు సార్.

టీచర్: వెరీ గుడ్, అవేమిటో కూడా చెప్పరా?

చింటు: ఋ..తు..వు...లు...సార్!!

**హోంవర్క్**

టీచర్: పిల్లలూ, శెలవుల్లో చేసుకురమ్మని మీకిచ్చిన హోం వర్క్ అంతా పూర్తి చేసుకొచ్చారా?

స్టూడెంట్: సార్, మరేమో..నేను శెలవులంతా మా హోంలో లేను టీచర్. తాతయ్యవాళ్ళింటికి వెళ్ళాను టీచర్!!

# మాలావత్ పూర్ణ

యువకెరటాలు

*నిర్వహణ : సౌమ్య, పుస్తకం డాట్ నెట్.*



నిండా పధ్నాలుగేళ్ళు లేవు- తెలంగాణ రాష్ట్రం-నిజామాబాద్ జిల్లా- సిరికొండ మండలం- పాకాల తాండాకు చెందిన పాప **మాలావత్ పూర్ణ** ఏకంగా ఎవరెస్టు శిఖరాన్నే ఎక్కేసింది! అంత ఎత్తు కెక్కిన అతి చిన్న అమ్మాయిగా ప్రపంచ రికార్డు సృష్టించింది! పట్టుదలతో సాధించలేనిదేదీ లేదని నిరూపించింది! అవకాశం, శిక్షణ లభిస్తే మనం దేన్నైనా అందుకోగలం- అనటానికి పూర్ణ నిలువెత్తు నిదర్శనం.

పూర్ణవాళ్ళ అమ్మానాన్నలు- లక్ష్మి,దేవదాస్- ఇద్దరూ వ్యవసాయ కూలీలు. వాళ్ళ అమ్మాయిని ప్రైవేటు బళ్ళలో లక్షలు కుమ్మరించి చదివించే శక్తీ-స్తోమతూ లేని పేదవాళ్ళు. పూర్ణని కూడా తాండాలో అందరిలాగే సాంఘిక సంక్షేమ హాస్టల్లో చేర్చారు.

హాస్టలులో పూర్ణ పూర్తిగా ప్రభుత్వ ఖర్చుతో చదువుతూ తొమ్మిదో తరగతికి వచ్చింది. ఈ క్రమంలో అధ్యాపకులు ఆ అమ్మాయికి క్రీడలలో ఉన్న నైపుణ్యాన్ని గుర్తించారు; ప్రోత్సహించారు. 'విద్యార్థులను తరగతి గదులకే పరిమితం చేయకూడదు-వారికి విశాల ప్రపంచాన్ని చూపించాలి' అనే సాంఘిక సంక్షేమ కార్యదర్శి ప్రవీణ్‌కుమార్ తోడ్పాటు లభించేసరికి, పూర్ణకు మొదట నల్గొండ జిల్లా భోంగీర్లో ఉన్న చిన్న చిన్న కొండలు ఎక్కే కార్యక్రమంలో ప్రవేశం లభించింది. అక్కడికి వచ్చిన పిల్లల్లోంచి ఇరవై మందిని ఎంపిక చేసి, శిక్షణ నివ్వటం కోసం డార్జిలింగ్ లో ఉన్న 'హిమాలయన్ మౌంటెనీరింగ్ ఇన్స్టిట్యూట్‌కు' పంపించారు ప్రభుత్వం వాళ్ళు.

అక్కడికి వచ్చిన పిల్లలందరితోబాటు హిమాలయాల్లో రకరకాల చిన్నా-చితకా శిఖరాలను అవలీలగా ఎక్కేసింది పూర్ణ. కొండలు ఎక్కటంలో పూర్ణ సత్తా ఏంటో చూసిన నిర్వాహకులు ఆ

పాపను ఏకంగా ఎవరెస్టు శిఖరాన్నే ఎక్కించేందుకు రంగం సిద్ధం చేసేశారు!



సముద్ర మట్టానికి 29,035 అడుగుల ఎత్తున ఉండే ఎవరెస్టు శిఖరం మీద చలి ఊహించుకుంటేనే వణికిస్తుంది: ఉష్ణోగ్రతలు మైనస్ 50 డిగ్రీల సెంటీగ్రేడు దగ్గర ఉంటాయి! గాలిలో ఆక్సిజన్ దాదాపు ఉండదు- మనం పీల్చుకునేందుకు అవసరమైన ఆక్సిజన్‌ను మనమే మోసుకుపోవాలి! అక్కడికి ఎక్కేందుకు వేసుకునే ప్రత్యేకమైన దుస్తులే 20 కిలోల వరకూ బరువుంటాయి! ప్రత్యేకమైన ఆహారం తీసుకోవాలి; పైపెచ్చు అక్కడికి వెళ్ళే మార్గమంతా ప్రమాదాలతో నిండుకున్నది. గతంలో ఎంతో మంది ఆ మంచులో ఇరుక్కొని ప్రాణాలు కూడా కోల్పోయారు!

అయితే అంతులేని స్థైర్యం, ఆత్మవిశ్వాసం ఉన్న పూర్ణ, తనతోపాటు ఎంపికైన ఆనంద్‌కుమార్‌తో కలిసి 52 రోజుల్లో ఎవరెస్టు శిఖరాన్ని అధిరోహించింది. రెండు నెలల క్రితమే, మే 25 న తెలంగాణ జెండాని ఎవరెస్టు శిఖరం మీద రెపరెపలాడించి, 'తలచుకుంటే దేన్నైనా సాధిస్తాం' అని చాటింది.

అనాదరణకు, నిరాసక్తతకూ గురై ఎంతో కాలంగా కృంగిపోతున్నై ప్రభుత్వ పాఠశాలలు. ప్రభుత్వ బళ్ళలో పాఠాలు చెప్పే అధ్యాపకులు కూడా తమ పిల్లల్ని ప్రైవేటు బళ్ళలో చదివించే దుస్థితి ఉన్నది. అలాంటి వాతావరణంలో పూర్ణ సాధించిన ఈ విజయం మన వారసత్వ సంపదలో జీవం ఇంకా మిగిలే ఉందని అందరికీ చాటుతున్నది. అవకాశాలు కల్పించి, ప్రోత్సహిస్తే ప్రభుత్వ బడులు నిజంగా అద్భుతాలనే సృష్టించగలవు.

ఎవరెస్టు శిఖరాన్ని అట్లా ఆడుతూ పాడుతూ ఎక్కేసిన అతి చిన్న అమ్మాయి పూర్ణ- మనందరికీ నిజంగా స్ఫూర్తిదాత. ఆమె ఇచ్చిన స్ఫూర్తితో మనందరం కనీసం నెలకొక్క కొండైనా ఎక్కుదాం, సరేనా? బయలుదేరండి మరి! 

మంచి పుస్తకం:

## గుర్రం గుడ్డు

పరమానందయ్య శిష్యుల కథలు

సంకలనం: రెడ్డి రాఘవయ్య

ఓహ్! పరమానందయ్య శిష్యులు!

నవ్వుల పువ్వుల్ని వెదజల్లే అల్లరి పిల్లలు!

ఏ తెలుగు వాళ్లకి తెలీదు, వీళ్లు?!

ఎటొచ్చీ వీళ్ల లీలల్ని నేరుగా చదవటం, అలా చదవటాన్నీ, రాయటాన్నీ సాధన చెయ్యటం , చేస్తూ చేస్తూ విరగబడి నవ్వటం - ఇదీ, కావలసింది!

దీన్ని పరిపూర్ణంగా పోషించే చిన్ని పుస్తకం- 'గుర్రంగుడ్డు' ! దీన్ని సంకలనం చేసి పెట్టిన రెడ్డిరాఘవయ్య గారు, ప్రచురించి అందించిన బాలల అకాడమీ వారు- అందరికీ జై!

గుర్రంగుడ్డు

ఆం.ప్ర.బాలల అకాడమి

పబ్లిక్ గార్డెన్స్,

హైదరాబాదు.

పేజీలు:68

రూ:5




మీకు తెలిసిన విషయాలను అందరితోటీ పంచుకునేందుకు చక్కని మాధ్యమాలు- కథలూ, కొత్తపల్లీ. ఇప్పటివరకు వెలువడిన కొత్తపల్లి పుస్తకాలనన్నిటినీ ఇంటర్నెట్లో http://kottapalli.in వద్ద ఉచితంగా చదువుకోవచ్చు. ఓపెన్‌సోర్సు స్ఫూర్తితో వెలువడుతున్న ఈ పత్రికను నడిపించటంలో మీ అందరి తోడ్పాటూ అవసరం! మరిన్ని వివరాలకోసం 'ఈమాట' వెబ్ పత్రికలో వచ్చిన ఇంటర్వ్యూ చదవండి: http://eemaata.com/em/issues/201405/4046.html

పిల్లల్లో సృజనాత్మకత సహజం. కథలు, ఆటలు, పాటలు, బొమ్మలు దానికి ఊతాన్నిస్తాయి. మాతృభాషలో ఇష్టంగా చదవటం, తేలికగా రాయటం వస్తే అటుపైన అన్ని శాస్త్రాలూ సులభంగా వంటపట్టుతాయి-నిజం! అందుకని మీ పిల్లల్లో ఉన్న కాల్పనిక శక్తికి పదును పెట్టండి. వాళ్లను కథలు రాసేందుకు, పాటలు పాడేందుకు, బొమ్మలు వేసేందుకు ప్రోత్సహించండి. వాళ్ళ రచనల్ని మాకు పంపండి. కావాలనిపిస్తే మీరే ఇలాంటి పత్రికనొకదాన్ని మొదలుపెట్టండి- ఎలాగైనా సరే- పిల్లలు పెద్దవాళ్లయ్యేలోగా వాళ్ళు చాలా చాలా తెలుగు కథల్ని చదివేలా, రాసేలా చేయండి. మీ పిల్లలకు ఈ పత్రికలోని కథలు నచ్చుతాయనే మా నమ్మకం- వీటిని వీలైనంత మందితో పంచుకోండి. మీరు రాసిన పిల్లల కథలు ఏమైనా ఉంటే పనిగట్టుకునైనా సరే, మాకు పంపండి. వీలు చేసుకొని ప్రచురిస్తాం.

## దాక్కున్న కథలు!

అనగా అనగా ఒక దేశంలో చాలా కథలుండేవి.

ఆ దేశంలో కథలు రాని పిల్లాడే లేడు. కథలు రాని పాపే లేదు. కథలు చెప్పటం రాని అవ్వలు-తాతలు అస్సలు లేరు. గొప్ప సంగతేంటంటే, ఆ దేశంలో చెట్లు-పుట్టలు, కొండ-గాలి, వాగు-వంక, పురుగు-పిట్ట, బళ్ళు-వాహనాలు, తాళ్ళు-పేళ్ళు ఇట్లాంటివన్నీ కూడా మా చక్కని కథలు చెప్పేవి. అక్కడ కథలు ఎన్ని కుప్ప పడ్డాయంటే, ఏ వైపున త్రవ్వినా లెక్కలేనన్ని కథలు దొరికేవి.

అయితే ఒకసారి ఆ దేశానికి ఎవరో మాంత్రికుడు వచ్చాడు. వాడు అసలు ఎక్కడినుండి వచ్చాడో, ఎన్నాళ్ళుంటాడో, మళ్ళీ ఎటు వెళ్తాడో ఎవ్వరికీ తెలీదు. ఈ దేశానికి రాగానే వాడు తనకు కనబడిన కథనల్లా కొనేసుకోవటం మొదలు పెట్టాడు. అందరికీ ఇది బలే అనిపించింది- చాలా వింత విషయం కదా, ఆ రోజుల్లో, కథలు కొనటం, అమ్మటం?! అలా అవ్వలు-తాతలు, అమ్మలు-నాన్నలు అందరూ వాడికి కథలు అమ్మేందుకు పోటీ పడ్డారు. కొందరు పనిలేనివాళ్ళైతే ఎక్కడెక్కడో ఉన్న కథల్ని కూడా త్రవ్వి త్రవ్వి అమ్మేశారు వాడికి. అక్కడినుండి వాడు పిల్లల దగ్గరికి వచ్చాడు కథల్ని ఇచ్చెయ్యమంటూ.

అయితే ఆ సరికల్లా దేశంలో ఉన్న పిల్లలతో పాటు గాలీ-నీళ్ళు, గొడ్డు-గోదా, చెట్టూ-చేమా, వాగూ-వంకా, దిక్కులు-దుమ్ము-దుశానం- ఇవన్నీ జరుగుతున్న మోసాన్ని పసిగట్టాయి. ఏమంటే, ఒకసారి మాంత్రికుడి సంచీలోకి వెళ్ళిపోయిన కథలు- ఇంక వెనక్కి రానే రావు!

దాంతో ఆ దేశంలోని పిల్లలు- వాళ్ళతోబాటు గాలీ-గోదా అన్నీ కూడా, వేటికవి- తమ దగ్గరున్న కథల్ని ఎవరికీ కనబడకుండా దాచేసుకున్నాయి.

కొన్నాళ్ళు అలా తిరిగిన తర్వాత, మాంత్రికుడేమో తను కొనుక్కున్న కథలతో మాయమైపోయాడు! అందరూ గోడు గోడు మన్నారు. కానీ ఏం లాభం? అమ్ముడుపోయిన కథలు ఇంక వెనక్కి రానే లేదు. ఇక మిగిలిన కథలేమో, మరి ఎవ్వరికీ కనబడకుండా దాక్కున్నాయాయె!

ఇన్నేళ్ల తర్వాత, మళ్ళీ ఇదిగో- అట్లా మిగిలిన కథల్లో కొన్ని అందాయి కొత్తపల్లికి. మేం ఈ కథల్ని స్వేచ్ఛగా పంచటం మొదలెట్టాం. వీటిని మీరూ అందుకోండి; మళ్ళీ పంచండి. స్వేచ్ఛగా ఉంచండి. మీ దగ్గరున్న కథల్నీ అంతే- వాటిని ఎంతమందితోటైనా పంచుకోండి; ఎందరికైనా చెప్పండి; స్వేచ్ఛగా ఉంచండి; తప్ప ఏనాడూ అమ్ముకోకండి.

ఎందుకంటే, కథల తీరే అది- ఓసారి మాంత్రికుడి సంచీలోకి వెళ్ళిపోయాయంటే ఇక అవి వెనక్కి రానే రావు మరి!

---

Published by NarayanaSarma for Kottapalli Prachuranalu,1-127/A, Near M.R.O.Office, Chennekothapalli-515101, Ananthapur District, AP.
Ph: 7702877670 mail: team@kottapalli.in and printed at Mudrica Offset Printers, Vijayawada,Phone:08662579129